ఓం.

శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర

విద్యావినుతానుపమసాహిత్య

సహజపాండిత్య

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమదాంధ్రభాగవతము

## షష్ఠ స్కంధము

పండిత పరిశోధితము.

---

ప్రకాశకులు

ఆంధ్రగ్రంథమండలి, తెనాలి.

బ్రాంచి, గరికపఱ్ఱు.

ఉయ్యూరుపోష్టు, కృష్ణాజిల్లా.

—

1929

రామకృష్ణా ప్రింటింగ్ వర్క్సు, తెనాలి.

సంపాదకులు,

దావులూరు కోటిసూర్యప్రకాశరావు,

నెక్కలపూడి సుబ్బారావుచౌదరి.

---

ప్రకాశకుడు

బాలకవి, దింటకుర్తి భాస్కరరాజు.

అరుంపళ్ళై రామసుబ్బ శాస్త్రిగారి స్వంతం

# శ్రీమదాంధ్ర భాగవత పద్యములు.



## శ్రీ సరస్వతీ ప్రార్థన.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు ♦ సోఁకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ ♦ సుందర వేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ ♦ చిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామశుక ♦ వారిజపుస్తక గమ్యపాణికిన్.

శా. తల్లీ నిన్నుఁ దలంచి పుస్తకము చే ♦ తం బూనితిన్ నీవు నా
యుల్లం బందున నిల్చి జృంభణముగా ♦ నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదువాక్కునను సం ♦ ప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ ♦ పూర్ణేందుబింబాననా.

## శ్రీమద్భాగవత గ్రంథప్రణేత యగు
## వ్యాసమహర్షి ప్రార్థన.

ఉ. ప్రాంశుపయోదనీలతను ♦ భాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశు జటాచ్ఛటాభరణు ♦ నాగమపుంజపదార్థతత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగ ♦ చర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశ ♦ వందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.

## శ్రీమద్భాగవతార్థోపదేష్ట యగు
## శుకమహర్షి ప్రార్థన.

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై ♦ సన్న్యాసియై యొంటిఁ బో
వ మహాభీతి నొహోకుమార యనుచున్ ♦ వ్యాసుండు చీరంగ వృ

క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు చ ♦ క్కం జేసె మున్నట్టి భూ
తమయున్ బ్రేమ మ్రొక్కెద బాదరాయణిఁ దపో♦ధన్యాగ్రణిన్ ధీమణిన్

## శ్రీ మ ద్భా గ వ త ప్రా ర్థ న.

ఆ. వేదకల్పవృక్ష ♦ విగళిత మయి శుక
ముఖసుధాద్రవమున ♦ మొనసి యున్న
భాగవతపురాణ ♦ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక ♦ భావవిదులు.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకా ♦ లాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమన ♦ స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల ♦ వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరువు ♦ ర్విన్ సద్ద్విజశ్రేయమై.

గ్రంథ నాయకుఁడగు

## శ్రీ రా మ మూ ర్తి ప్రా ర్థ న.

క. శ్రీకంఠచాపఖండన
పాకారిప్రముఖవినుత ♦ భండన విలస
త్కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల ♦ రామ నృపాలా.

---

# విషయసూచిక.

## షష్ఠస్కంధము.



---



శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర భాగవతము

## షష్ఠ స్కంధము.



వత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్థల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షుఁ గం
[జాతభూ
దేవేంద్రాదిసమస్తదేవమకుటోద్దీప్తోరురత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం
బ్రశంసించెదన్. 1

ఉ. నిండుమతిం దలంతుఁ గమనీయభుజంగమరాజమండలీ
మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకుఁ దారమల్లికా
పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో
దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్ 2

ఉ. హంసతురంగముం బరమహంసము నంచితదేవతాకులో
త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసముం
గంసజిష్ణూంశునంశమును గర్బురసూత్రసమావృతాంసమున్
హింస నడంచు బ్రహ్మము ననూనశుభంబులకై భజించెదన్ 3

ఉ. మోదకహస్తునిన్ సమద•మూషకవాహను నేకదంతులం
బోదరు నంబికాతనయు•నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు•నంచితభక్తఫలప్రదాయకున్
మోదముతోడ హస్తములు•మోడ్చి భజించెద విఘ్నసిద్ధికిన్ 4

ఉ. కల్లతనంబుగాక పొడ•గట్టిన పూర్వపుకీర్తి నేఁడు నా
యుల్లమునందు నుండుము స•ముజ్జ్వల తేజముతోడ భక్తిరం
జిల్లినచూపు గూడ విధిఁ • జెందిన ప్రోడ బుధాళినేడ మా
తల్లి దయామతల్లి ప్రణ•తద్రుమకల్పవల్లి భారతీ. 5

క. విలసత్కంకణరవరవ
కలితంబగు నభయవరద • కరములఁ బెరయం
జెలరేఁగి భక్తులకు సల
కలుముల దయసేయుజలధి • కన్యకఁదలఁతున్. 6

క. కాళికి బహుసన్నుతలో
కాళికిఁ గమనీయవలయ • కరకీలితకం
కాళికిఁదాపసమానస
కేళికి వందనము సేసి • కీర్తింతుమదిన్. 7

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి. 8

చ. పరమసమాధిధుర్యుఁ బటు • పాపనకర్మవిధేయు దేవతా
వరనరవంద్యు సద్విమల • వాక్యుఁ జనార్దనకీర్తనక్రియా
భరణసమర్థు వేదచయ • పారగు భవ్యుఁ ద్రికాలవేదిఁబా
సురమతిఁగొల్చుటొప్పుబుధ•శోభితుఁబుణ్యుఁబరాశరాత్మజున్.

క. వ్యాసుని భగవత్పదసం
వాసుని నాగమపురాణ, వరవిష్ణుకథా
వాసుని నిర్మలకవితా
భ్యాసుని పదపద్మయుగము. భావింతు మదిన్. 10

సీ. వరకవితోద్రేకి ♦ వాల్మీకిఁ గొనియాడి
భాగవతార్థజ్ఞు ♦ భవముఁ బలుకు
శుకమంజులాలాపు ♦ శుకయోగిఁ బ్రార్థించి
బాణమయూరుల ♦ ప్రతిభ నోడిసి
భాసస్వామిల్లిక ♦ భారవిమాఘుల
ఘనసుధామధురవా ♦ క్యములఁ దలఁచి
కాళిదాసుఁ గవీంద్ర ♦ కల్పవృక్షముఁ గొల్చి
నన్నపాచార్యు వ ♦ ర్ణనలఁ బొగడి
తే. వెలయఁ దిక్కనసోమయా ♦ జుల భజించి
యెఱ్ఱనామాత్యభాస్కరు ♦ నిచ్చఁ గొలిచి
సుకవిసోముని నాచన ♦ సోము నెఱిఁగి
కవిమనోనాథు శ్రీనాథు ♦ ఘనత మెచ్చి. 11

ఉ. ఎమ్మెలు సెప్ప నేల జగ ♦ మెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు ♦ సూఱలు చేసినవాని భక్తిలో
నమ్మినవాని భాగవత ♦ నైష్ఠికుఁడైతగువాని బేర్మితో
బమ్మెరపోతరాజు గవి ♦ పట్టపురాజు దలంచి మ్రొక్కెదన్.

వ. అని సకలసుకవినికరంబులకు ముకుళితకరకమలుండనై. 13

ఉ. ఎయ్యది కర్మబంధముల ♦ నెల్ల హరించు విభూతి కారణం
బెయ్యది సన్మునీంద్రులకు ♦ నెల్లగవిత్వసమాశ్రయంబు మా

న్నెయ్యది సర్వమంత్రములఁ నేలిన దెయ్యది మోక్షలక్ష్మికూ
పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్యమంత్రమున్.

వ. అని శ్రీ మహాభాగవత పురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచియింపం బూని యీకృతికిం బతిగా నెవ్వండు గలండని వితర్కించి నాకుం గవిత్వమహత్త్వంబు సంప్రాప్తంబగు కాలంబు దలంచి నారాయణుండె దైవంబని యెఱింగి మనోరథంబు సఫలం బయ్యెనని యీకృతిఁ గృష్ణార్పణంబు జేసితి. నది యెట్లనిన, నేను విద్యాభ్యాసంబునందగిలి కొంతకన్నెయుండ నొక్కనాఁడు దివంబున. 15

చ. కలితవిశేషవస్త్రములుఁ గట్టిహిమాంబుసుగంధచందనంబల
దివినూత్న భూషణములారఁగఁ దాల్చి వినోదలీలనింపులమ్ర
దుశయ్య నిద్రఁ దగఁ బొందినచోఁ గనువట్టెఁ బల్మఱుందలము
నఁగ్రమ్మ క్రొమ్మెఱుఁగుతండముఱూపుననిల్చుపోలికన్. 16

సీ. ఉరవడిఁ బ్రాగ్వీథి నుదయించు మార్తాండ
కోటిబింబచ్ఛాయఁ గూడినట్లు
హరిహరబ్రహ్మల యాత్మలలో నుబ్బి
కరుణయొక్కటమూర్తిఁ బెరసినట్లు
ఖరకరకరతీవ్రఁ గతినిఁ గరంగుచు
హేమాద్రి చెంతఁ బెల్లెగసినట్లు
ఫణిరాజఫణరాజి మణిగణవిస్ఫూర్తి
నుషిరంపు వెలిఁ దల సూపినట్లు

తే. ఉట్టిపడ్డట్లు కట్టెఱ్ఱనూదినట్లు
తేజమెసఁగంగ నాహొంలఁ దివ్యవాణి

పూని సాక్షాత్కరించి సం♦పూర్ణ దృష్టిఁ
జూచి యిట్లని పలికె మం♦జులముగాను. 17

ఉ. ఆటలుఁబాటలుంజదువు♦లద్భుతముల్ విననొప్పువాద్యముల్
సాటి దలంప రాని బలు♦సాములు మున్నగువిద్యలెల్ల నీ
కాటలుఁ బాటలయ్యె విను♦మన్నిటికిన్ మెఱుఁగిడ్డభంగి నా
చాటున జాటు కారపద♦సాధుకవిత్వముఁ జెప్పుమింపుగన్ 18

వ. అని యానతిచ్చు జగన్మాతృకృపావలోకనశుశ్లోకుండనై
యేనొక్కశ్లోకంబు నాక్షణంబ నుడివితి నది యెట్టిదనిన

శ్లో. హంసాయ సత్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణ పుణ్యపతయే హరయేనమస్తే. 20

వ. ఈ శ్లోకం బద్దేవి యంగీకరించె. నంత మేలుకాంచి యా
నందభరితుండనై నాటనుండి చంద్రానుగతయగు చంద్రిక
యుం బోలె నారాయణాంకితంబయిన కవిత్వతత్వజ్ఞా
నంబు గోచరం బయ్యె. దానికి ఫలంబుగా గోపికావల్లభుని
నుల్లంబున నిడుకొని. 21

ఆ. పలుకఁ గలిగె మొదల ♦ భాగవతార్థంబు
భర్త కృష్ణుఁ డయ్యె ♦ భాగ్య మొదవె
నమృతరసముఁ గోర ♦ నలరు చింతామణి
పాత్ర సంభవించు ♦ భంగి నిపుడు. 22

ఆ. భాగవతము తేట ♦ పఱుప నెవ్వఁడు చాలు
శుకుఁడు దక్క నర్జుని ♦ సఖుఁడు దక్క

బుద్ధిఁ దోఁచినంత ♦ బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత ♦ పలుకువాఁడ. 23

ఉ. పుట్టిననాఁటనుండియును ♦ బుట్టదె యెట్టియ దట్టునైనఁజే
పట్టి నుతింపఁ జిత్తము శు ♦ భంబగు మద్వరవాక్యసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁ ♦ బాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పెదను బుధ్ధోత్తములానుఁడు శ్రోత్రపద్ధతిన్ 

వ. అని. 25

సీ. శ్రీవత్సగోత్రుఁడు ♦ శివభక్తియుక్తిఁ డా
పస్తంబసూత్రుఁ డ ♦ పారగుణుఁడు
నేర్చూరిశాసనుం ♦ డెల్లనప్రగ్గడ
పుత్త్రిండు వీరన ♦ పుణ్యమూర్తి
కాత్మజుండగు నాద ♦ యామాత్యునకుఁ బోల
మాంబకు నందను ♦ లమితయశులు
కసువనామాత్యుండు ♦ ఘనుఁడు వీరనమంత్రి
సింగధీమణియు సం ♦ చితగుణాఢ్యు
తే. లుద్భవించిరి తేజంబు ♦ లూర్జితముగ
బొరిది మూర్తిత్రయంబన ♦ శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువన ♦ ప్రభువునకును
ముమ్మడమ్మనుసాధ్వి యి ♦ మ్ముగలను వెలసె. 26

ఉ. ఆడదు భర్తమాట కెదు ♦ రాడదు వచ్చిన వారివీడఁగా
నాడదు పెక్కుభాష లెడ ♦ నాడదు వాకిలి వెళ్ళి కల్లమా
టాడదు మిన్న కేని సుగు ♦ ణావళి కిందిర గాక సాటి యే
చేడియ లేరు చూరికులి ♦ శేఖరుకస్వయముమ్మడమ్మకున్.

క. ఆకసువయమంత్రికిఁ బు,
ణ్యాకల్పశుభాంగి యుమ్మ ♦ డమ్మ మను న్న
వ్యాకులచిత్తుల నిరువుర
శ్రీకరగుణగణులఁ బుణ్య ♦ శీలురఁ గాంచెన్. 28

క. అంగజసమలావణ్య శు
భాంగులు హరిదివ్యపద యు ♦ గాంబుజవిలస
ద్భృంగాయమానచిత్తులు
సింగయ తెలగయలు మంత్రి ♦ శేఖరు లనఁగన్. 29

క. అందగ్రజుండ శివ పూ
జం దనరినవాఁడ విష్ణు ♦ చరితామృతస
ష్యందిపటువాగ్విలాసా
నందోచితమానసుండ ♦ నయకోవిదుఁడన్. 30

వ. కావునం గృష్ణపాదారవింద సందర్శ నాదర్శ తలాయమాన చిత్తుండనను. 31

షష్ఠ్యంతములు.

క. శ్రీపతికి మత్స్యతికి నుత
గోపతికిఁ ద్రిలోకపతికి ♦ గురుజన బుధసం
తాపనివారణ మతికిం
బ్రాపితసనకాదియతికి ♦ బహుతర ధృతికిన్. 32

క. హరికి గురుకలుషకుంజర
హరికి బలాభీలహరికి ♦ నంతస్థితగ
హ్వరికి నరహరికి రక్షిత
కరికిఁ గరాగ్రస్థహరికి ♦ ఘనతరకిరికిన్. 33

క. గుణికి సమాశ్రితచింతా
మణికి మహేంద్రాది దివిజ • మండల చూడా
మణికిఁ బ్రకల్పిత శయ్యా
ఫణికి నురోభాగ కౌస్తు • భప్రియమణికిన్. 34

క. కంసాసుర సంహరున
కంసాంచిత కర్ణకుండ • లాభరణునకున్
హింసాపర వరమస్తక
మాంసకరాళిత గదాభి • నుతహస్తునకున్. 35

క. వరయోగి మానసాంతః
కరణసుధాంబోధిభావ • కల్లోలలన
త్పరతత్త్వ శేషశాయికిఁ
జిరదాయికి సకలభక్త • చింతామణికిన్. 36

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన షష్ఠస్కంధంబునకుఁ గథాప్రారంభ క్రమం బెట్టిదనిన హరిచరణస్మరణ పరిణామవినోదు లయిన శౌనకాదులకు నిఖిలపురాణేతిహాసనిర్ణయవిఖ్యాతుం డైన సూతుం డిట్లనియె. 37

క. శ్రీరమణీరమణకథా
పారాయణచిత్తుఁ డగుచుఁ • బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున
సూరిజనానందసాంద్రు • శుకయోగీంద్రున్. 38

సీ. షడ్గుణైశ్వర్య శా • శ్వతమూర్తి యయినట్టి
మునినాథ దయతోడ • ముక్తిపదము
మున్నుగా నేమార్గ • మున వినిపించితి

వారయ నపవర్గ • భూరిమహిమఁ
గ్రమయోగసంభవ • బ్రహ్మంబుతోఁ గూడ
నను వొంద • నగు నని వినుతి కెక్కి
మఱియు సత్త్వరజస్త • మః ప్రభావంబులఁ
గడిఁది యై యున్నట్టి • కర్మచయము

తే. నప్పటప్పటి కడఁగని • యట్టి ప్రకృతి
గలుగుపురుషుని భోగార్థ • ఘటన దేహ
కారణారంభరూపమా • ర్గంబు మొదలు
మాటి మాటికి నన్నియుఁ • దేటపడఁగ. 39

వ. మఱియు ననేక పాపలక్షణంబు లగు నానావిధనరకంబు లును వాని కాద్యంతంబులును స్వాయంభువసంబంధి యగు మన్వంతరంబును బ్రియవ్రతోత్తానపాదుల వంశంబును దచ్చరిత్రంబును ద్వీపవర్ష సముద్రాదినద్యుద్యానవనస్పతు లును భూమండల సంస్థానంబును వాని పరిమాణంబును జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును విభుం డగు న పరమేశ్వ రుం డెవ్విధంబున నిర్మించె. నావిధం బంతయు నెఱింగించి నాడ విన్నాడు. 40

ఆ. కడిఁది వేదనలకుఁ • గారణం బై యుండు
గుఱుతు లేని నరక • కూపరాశి
పాలు గాక నరుఁడు • బ్రదికెడు మార్గంబు
పరమపుణ్య తెలియఁ • బలుకవయ్య. 41

వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

క. కట్టా త్రికరణ మెఱుఁగక
పుట్టినదురితముల నపుడు • పొలియింపని యా
కట్టిఁడి దేహం బుడిగినఁ
గొట్టాడును బిట్టునరక • కూపంబులలోన్.

ఉ. కావునఁ గాలకింకరవి • కారము గానక మున్న మృత్యుదు
ర్భావనఁ జిత్తముల్ వెడఁగు • పాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్గు చుండఁ దన • చెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనవిత్తుఁ డైయఘము • బాయు తెఱంగొనరింపఁగాఁదగున్

క. కాలం బెడ గని పాపము
మూలముఁ జెఱుపంగవలయు • మును రోగములం
దేలినదోషము నెఱుఁగుచు
వాలాయము దాని నడఁచు • వైద్యునిభంగిన్. 45

సీ. అనవుడు నాతని • కనియె భూకాంతుండు
కనుకలి వినుకలి • కలిగినట్టి
పాపము దనకు ని • ప్పని దని కని చాలఁ
బరితప్తుఁ డయ్యు గ్ర • మ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోష • మోచనం బెయ్యది
యారయ నెఱిఁగింపు • మదియుఁ గాక
కలుష మొక్కొకచోటఁ • గావించు నొకచోట
గావింపకుండుఁ ద • త్కర్మ మెఱిఁగి

ఆ. ఇట్టిజనుఁడు పుణ్య • మేరీతిఁ జేసిన
నదిఫలింపనేర • దఁట దలంతు

సలిలమందు మేని • మలినంబు వోకుండ
గజము గ్రుంకు వెట్టు • గతియుఁ బోలె. 46

వ. అనిన శుకుండిట్లనియె.

క. కర్మము గర్మముచేతను
నిర్మూలము కాదు వెలియ • నేరక తానే
కర్మము చేసినఁ దత్ప్రీతి,
కర్మం బొనరింపవలయుఁ • గలుషవిదూరా. 48

క. హితవు గల కుడువు మజ్జిరు,
గ్వితతులఁ బొడమాఁగ నీవిధమున నతిస
ద్వ్రితుఁ డైనవాఁడు నిర్మల,
మతిచే నఘరాశి నెల్ల • మట్టము సేయున్. 49

చ. తపమున బ్రహ్మచర్యమున • దానమునన్ శమ సద్దమంబులన్
జపమున సత్యశౌచముల • సన్నియమాదియమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు • నిక్కము హృత్తనువాక్యజంపు పా
పపుగుది ద్రుంతు రగ్నిశిత • పర్వవనంబుల నేర్చు కైవడిన్. 50

వ. అదియునుం గాక. 51

ఉ. కొందఱు పుణ్యవర్తనులు • గోపకుమార పదారవిందజా
వందమరందపానకల • నారతషట్పదచిత్తులై చను గో
విందపరాయణుల్ విమల • వేషులు దోషము డంతురాత్మలం
జెందిన భక్తిచేత రవి • చేకొని మంచు నడంచు కైవడిన్. 52

క. హరిభక్తిచేతఁ గొందఱు
పరిమార్తురు మొదలు ముట్ట • పాపంబుల ని

స్ఫురతరకరముల సూర్యుం
డరుదుగఁ బెనుమంచు బించ • మడచినభంగిన్. 53

క. దంతిపురనాథ విను మొక
మంతన మెఱిగింతు శమద • మంబులు సంహా
వంతు శుభవంతుఁ జేయవు
కంతునిగురుభక్తి ముక్తిఁ • గలిగించుగతిన్. 54

సీ. హరికి నర్థముఁ బ్రాణ • మర్పితంబుగఁ జేయు
వానికైవల్య మె • వ్వానికి లేదు
వనజలోచను భక్త • వరుల సేవించిన
వానికైవల్య మె • వ్వానికి లేదు
వైకుంఠనిర్మల • వ్రతరతుం డయినట్టి
వానికైవల్య మె • వ్వానికి లేదు
సరసిజోదరుకథా • శ్రవణలోలుం డైన
వానికైవల్య మె • వ్వానికి లేదు

తే. లేదు తపముల బ్రహ్మచ • ర్యాదినియతి
శమదమాదుల సత్యశౌ • చముల దాన
ధర్మమఖముల సుస్థిర • స్థాన మైన
వైష్ణవజ్ఞానజనిత ని • ర్వాణపదము. 55

తే. అరయ నెన్నఁడు జేటు లే • నట్టిముక్తి
వర్త్మ మీలోకమందు నె • వ్వరికిఁ గలదు
సాధులును బుణ్యశీలురు • సజ్జనులును
హరిపరాయణతత్పరు • లయినఁ గాక. 56

క. అరుదుగ నరహరిభక్తిం
బొరయని యాపురుషుసుకృతపుంజంబులు వే
మఱుఁ బుణ్యుఁ జేయ నేరవు,
నరవర మధుఘటముఁ జెఱకునదులుం బోలెన్. 57

చ. సతతముఁ గృష్ణపాదజలజంబులయందు మనంబు నిల్పు సు
వ్రతులుఁ దదీయశుద్ధగుణరాగులుఁ గాలునియుగ్రపాశసం
హతుల ధరించు తత్సుభటసర్గములం గలలోనఁ గాన రే
గతులను దుష్టకర్మములు గ్రక్కొనివారలఁ జెందనేర్చునే. 58

వ. కావున నీయర్థంబునకుఁ బురాతనం బగు నొక్క యితిహా
సంబుగల దని విష్ణుదూత యమదూతసంవాదం బనంబడు
దాని నెఱింగింతు నాకర్ణింపుము. 59

అ జా మి ళో పా ఖ్యా న ము.

సీ. నరనాథ వినుము కన్యాకుబ్జపురమునఁ
గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగఁ
బాతకుం డతులనిర్భాగ్యుం డవజ్ఞుండు
నష్టసదాచారకష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబులందును
శౌర్యంబునందు మత్సరము గలిగి
తొత్తాత్మపత్నిగా మత్తుఁడై వరియించి
కొడుకులఁ బదుగురఁ బడసి చాల

ఆ. మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీఱ
బాలలాలనాదిలీలఁ దగిలి

పెద్దకాల మతఁడు • పెంపార సుఖియించి
ఫలిత మొల్ల వదలి • పతితుఁ డయ్యె.

సీ. నిర్మలంబునఁ జాల • నెరయుచిత్తంబున
నల్లనివెండ్రుకల్ • దెల్లనయ్యెఁ
దగు మోహపాశ బం • ధంబు జాఱినమాడ్కిఁ
వదలిన యంగముల్ • వదలి వ్రేలె
నింద్రియంబుల కోర్కు • లిఁక నొల్లననుభంగి
నడుగక తల చాల • వడఁకెఁ జొచ్చె
దమకంబు ప్రాయంబు • దగిలిపోయినమాడ్కి
లోచనంబుల చూడ్కి • నీచమయ్యె

ఆ. వగరు పుట్టెనంతఁ • బెగలెఁ దంతంబులు
నుక్కిసయును దగ్గు • బిక్కటిల్లె
శిరసు నొవ్వఁ దొడఁగెఁ • జెదరె మనం బంతఁ
గడిఁది యైన ముప్పు • కాలమునకు. 61

ఆ. ఎనయ నతని కెనుబ • దేనిమిది వర్షంబు
లంత నరుగుటయును • భ్రాంతుఁ డగుచుఁ
గోరి పిన్నకొడుకు • నారాయణాఖ్యుండు
బాలుఁ డగుట మిగుల • భక్తిఁ జేసి. 62

క. తన సతియుఁ దానుఁ గూరిమి
మనమునఁ బెనఁగొనఁగ నక్కు • మారుని ననిశం
బును ముద్దు సేయుచుండెను
జనవర వాత్సల్యమాత్మ • సందడి గొనఁగన్. 63

క. బాలుని ముగ్ధవచోంబుజ
ఫాలుని నిజజనకబంధు • పరిణామకళా
శీలుని లోలతఁ గనుఁగొని
యాలరి బ్రాహ్మణుఁడు నంది • తా మ్రందగుచున్, 64

క. అత్యంత పానభోజన
కృత్యంబులఁ బొత్తుగలసి • క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత
మృత్యువుఁ గన నేరఁడయ్యె • మిక్కిలి జడుఁడై. 65

తే. తెలియ కీరీతి నతఁడు వ • ర్తించుచుండ
భయద మగు మృత్యుకాలంబు • ప్రాప్త మయిన
భూరివాత్సల్యవృత్తి న • ప్పుత్త్రుఁ దలఁచి
యాత్మఁ బ్రలపించె నారాయ • ణా యటంచు. 66

వ. అప్పుడు. 67

క. కింకరుల ధర్మరాజవ
శంకరుల దురంత దురిత • సమధికజననా
శంకరుల సకలలోకభ
యంకరులం గనియె నింద్రి • యాకులుఁ డగుచున్. 68

క. ఘాతుకుల దండధండిత
పాతకుల మహోగ్రకర్మ • భరసంహరణా
జాతకులఁ బ్రేతనాయక
దూతక సంతతుల నతఁడు • దూరమునందున్. 69

మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషసంస్ఫూర్తలన్
ఘనపీనోష్ఠనికారవక్త్రశిఖిల స • ద్గర్వేక్షణోపేతలన్

జనసంత్రాసకరోద్యతాయతసుపా • శశ్రేణికాహస్తులన్
హననవ్యాప్తివిభీతులన్ మువురనా • త్మానేతలన్ దూతలన్.

వ. ఇట్లతివికృతతుండగండాభోగవిభాగవిషమవివృతనేత్రులు న
తిపుష్టనిష్ఠురతనుయష్టిసంవేష్టితమహోర్ధ్వరోములు నభ్య
స్తసమస్తజీవాపహరణకరణప్రశస్తహస్తవిన్యస్తపాశధారులు
నగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు
వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచ
నుండును విహ్వలాత్మకుండును నై. 71

క. దూరమున నాడు బాలుఁడు
బోరునఁ దనచిత్తసీమఁ • బోఁకట్టినచో
నారాయణ నారాయణ
నారాయణయనుచు నాత్మనందను నొడివెన్. 72

చ, మరణపువేళ నద్దనుజ • మర్దను సంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తులాత్మపరి • పాలకు నామము నాలకించి వి
ష్ణురగతి నేగుదెంచి పొడ • సూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషలన్ వికట • కల్పితవేషుల దీర్ఘరోషులన్. 73

క. దాసీభర్తనజామిళ
భూసురుఁ దత్తనువువలన • బోరన వెలికిం
దీసిన యమభటులను బో
ద్రోసిరి శ్రీవరుని కూర్మి • దూతలు కినిమిన్.

విష్ణుదూత యమదూతల సంవాదము.

వ, ఇట్లు విష్ణుదూషణవలన నిర్ధూతప్రయత్నులై యమదూత
లిట్లనిరి.

క. ఎవ్వని వారలు మా తోఁ
జిహ్వాకుఁ గత మేమి యిట్లు • చిక్కినవానిం
గ్రొవ్వున విడిపించితి రిఁక
నవ్వ్యాలకో జమునిశాస • నంబులు జగతిన్. 76

వ. అదియునుం గాక. 77

సీ. ఎవ్వరు మీ రయ్య • యీ భవ్యరూపముల్
గన్నుల కద్భుత • క్రమ మొనర్చె
దివ్యోప దివ్యులో • దేవతాప్రవరులో
సిద్ధులో సాధ్యులో • చెప్పరయ్య
దళిత పాండురపద్మ • దళదీర్ఘనేత్రులు
వరపీత కౌశేయ • వాసు లరయ
గండమండల నట • త్కుండల ద్వయులును
బటుకిరీట ప్రభా • భాసితులును

తే. భూరి పుష్కరమాలికా • చారువక్షు
లమిత కోమల నవయౌవ • నాధికులును
బాహు కేయూర మణిగణ • భ్రాజమాన
ఘనచతుర్భుజు లభ్రసం • కాశరుచులు. 78

క. ధనువులు నిషంగచయములు
కనదంబుజ శంఖచక్ర • ఖడ్గగదా సా
ధనములు ధరియించిన మీ
తనువులు లోకముల కద్భు • తం బొనరించెన్. 79

క. శాంతంబు లయిన మీ తను
కాంతులు జగములును దిశలఁ • గలిగిన బహుళ

ధ్వాంతములఁ బాఱఁ దోలుచు
సంతస మొనరించె నిపుడు • సర్వాంకవమై. 80

వ. ఇట్లఖిలలోకానందకర కమ్రాకారులును నఖిల విభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును నిఖిలధర్మ పాలురును నగు మీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతంబేమి యనిన వారు ధర్మరాజానుచరులు గారను తలంపున మందస్మిత కందళిత ముఖారవిందులై గోవిందుని కందువమందిరంబు కావలి వారలు వారి వాహాగంభీర నిర్ఘోష పరిపోషణంబులైన విశేషభాషణంబుల నిట్లనిరి. 81

ఉ. మీరు పరేతనాయకుని • మేలిమిదూత లఁటేనిఁ బల్కుఁడా
తోరపుఁబుణ్యలక్షణము • దుష్కృతభావము దండకృత్యముం
బీరముతోడ నీతని క • భీష్టనివాసము నోలి దండ్యులె
వ్వారలొ సర్వభూతములొ • వారొకకొందఱు పాపకర్ములో 82

వ. అనిన యమభటు లిట్లనిరి. 83

క. వేదప్రణిహితమే యను
మోదంబుగ ధర్మ మయ్యె • మున్ను తదన్యం
బేది యగు నది యధర్మం
బాదియు హరిరూపు వేద • మని వినుకతనన్. 84

సీ. ఎవ్వనిచేఁ దన • యిర వొందు త్రిగుణస్వ
భావ మైనట్టి యీ • ప్రాణిచయము
లను గుణనామక్రి • యా రూపములచేత
నేర్పడుచుఁగతిఁ దాన • యెఱుఁగఁబడును

నర్యముఁ దనలంబు • నాకాశమును బ్రభం
జనముఁ గోచయమును • శశధరుండు
సంధ్యలు దివసములు • శర్వరీచయములుఁ
గాలంబు వసుమతీ • జాలములును
తే దేహధారికి సాక్షులై • తెలుపుచుండు
దండనస్థానవిధము స • ద్ధర్మగతియుఁ
దగులు మీరిక్రమానుగో • ధనము చేసి
యఖిలకర్మలు దండార్హు • లరయు నెపుడు. 85
తే. కోరికర్మంబు నడపెడు • వారికెల్లఁ
గలితశుభములు నశుభముల్ • గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి • యైన యపుడె
పూనికర్మంబు సేయక • మానరాదు. 86
క. ప్రకృతమునఁ దా నొనర్చిన
సుకృతము దుష్కృతము నెంత • చూడఁగ నంతే
వికృతి గని యనుభవించును
నకృతమతిఁ దత్ఫలంబు • నతినిష్ఠురుఁడై. 87
వ. మఱియు వినుండు జన్మంబు శాంత ఘోరమూఢగుణంబుల చేత నైనను సుఖ దుఃఖగుణంబులచేతనైనను ధార్మికాది గుణంబులచేత నైనను సకలభూతంబులుఁ ద్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు, నాప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు. దేవుండైన యముండు సర్వజీవాంతర్యామి యై ధర్మాధర్మ యుక్తం బైన పూర్వరూపంబుల విశేష రూపంబులచేతం జూచుచుండి, వాని కనురూపంబులఁ

జింతించుచుండు. నవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీనకర్మంబులచేత నేర్పడిన వర్తమానదేహంబు నేనని దలంచుచుండు, నష్టజన్మస్మృతి గలవాఁడై పూర్వాపరంబు లెఱుఁగంజాలకుండు. మఱియుఁ గర్మేంద్రియంబులచేతఁ గర్మంబులం జేయుచుండి జ్ఞానేంద్రియంబులచేతఁ దమోవిషయంబులైన శబ్దస్పర్శరూపరసగంధంబుల నెఱుంగుచుండి పదియాఱవది యైన మనంబుతోఁ గూడి పదియేడవవాఁ డగుచుండి షోడశోపాధ్యంతర్గతుం డయి యొక్కరుండైన జీవుండు సర్వేంద్రియ విషయప్రతిసంధానంబులకొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులఁబొందు షోడశకళలు గలిగి లింగశరీరంబనంబరఁగి గుణత్రయకార్యం బగు నిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియించుచుండు. విజితషడ్వర్గుండైన దేహి కర్మంబు లొల్లమి బుద్ధినెఱింగియు వివియుఁ గర్మంబులు సేయుచుండి తనసంచారకర్మంబునం జుట్టుకొన్న పసిరికాయ పురువునుం బోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమాన వసంతాది కాలంబు భూతభావి వసంతాది కాలయోగ్యంబైన పుష్పఫలాదులు తత్కాలజ్ఞాపకంబు నట్లు సేయు నట్లు భూతభావిజన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు. నొక్కనరుండు నొక్కక్షణంబును గర్మంబు సేయకుండువాఁడు లేఁడు. పూర్వసంస్కారంబులం గల గుణంబులచేతఁ బురుషుం డపశుండు గావున బలిమిఁ గర్మంబు సేయింపఁబడు

చుండు, నవ్యక్త నిమిత్తంబు నొంది తదనురూపంబు లైన స్థూల సూక్ష్మ శరీరంబులు మాతాపితృసదృశంబు లగు చుండు. నట్టి విపర్యయంబు పురుషునకుఁ బ్రకృతి సంగమం బునం గలుగు చుండు. నా ప్రకృతి పురాణపురుషుండైన యప్పరమేశ్వరుని సేవించినం డలంగు చుండు.

సీ. కావున నతఁడు సంతత్కర్మవర్తనమున
భూదేవకులమునఁ • బుట్టినాఁడు
దాంతుఁడై శాంతుడై • ధర్మసంశీలుడై
సకల వేదంబులఁ • జదివినాఁడు
అనయంబు గురువుల • నతిథుల పెద్దల
జేరి శుశ్రూషలఁ • జేసినాఁడు
సర్వభూతములకు • సమబుద్ధియై చాల
బహుమంత్రసిద్ధులఁ • బడసినాఁడు
తే. సత్యభాషణ నియమంబు • జరపినాఁడు
నిత్యనైమిత్తికాచల • నెరపినాఁడు
దండిలోభాది గుణములఁ • దరపినాఁడు
మంచి గుణములు దనయందు • మరపినాఁడు. 90

క. సతతాచారసమంచిత
మతియై సుజ్ఞానమునను • మరగెడుతఱి నా
యతగతి నాతని కంగజ
మతమైన నవయౌవనాగ • మం బెడ సొచ్చెన్. 91

కంట యౌవన • గర్వంబు వొడకట్టె
మదిలోన నుద్రేక • మదము దొట్టె

గడు మేనఁగామ వి • కారంబు దలసూపె
 ముఖమునఁ జిఱునవ్వుఁ • మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం • బయ్యె దేహం బెల్లఁ
 గచభారమున నెఱి • కప్పు మెఱసెఁ
గటిభారమున నూరు • కాండముల్ జిగిమీఱె
 బాహుశాఖలు దీర్ఘ • భంగి దోఁచె
ఆ. నురము విపుల మయ్యె • నుల్లసద్వరకాంతి
 పూర మంగకమునఁ • బొందుపడియె
 భూరితేజుఁ డయిన • భూసురాన్వయునకు
 నభినవైక యౌవ • నాగమమున. 91
క. హృదయమునఁ బొడము యౌవన
 మదము వెలిం దోఁచుభంగి • మాసితరుచిఁ ద
 ద్వదనమున నూఁగుమీసలు
 పొదలుచుఁ గప్పడరి చూడఁ • బొంకం బయ్యెన్. 92
వ. మఱియును. 93
క. తమ్మివిరిమీఁద వ్రాలిన
 తుమ్మెదపంక్తియును బోలెఁ • దోరపులీలం
 గ్రమ్ముకొని విప్రతనయుని
నెమ్మొగమునఁగానఁబడియె • నెఱిమీసంబుల్. 94
వ. అంతననంగ బ్రహ్మతంత్రంబునకు వసంతుండొనర్చు నంకు
రార్పణారంభంబునుంబోలె లలితకిసలయవిసర ప్రసారభాసుర
బహుపాదపాది పురోప వన పవనజవన ప్రభావ పరికంపిత
విటవిటీ జన హృదయ ప్రఫుల్ల పల్లవ భల్లంబును నన

ప్రసూన నిర్భరగర్భా విర్భూత సురభి పరాగ పటల పట
ఘటితనభోమండలంబును, వమందనిష్యంద మరందబిందు
సందోహ కందళిత చిత్రమత్త మధుప సంకుల ఝుంకార
ము ఖరిత సకలదిశావలయంబును, నిరంతర ధారాళ రసభ
రిత పరిపక్వ ఫలానుభవ ప్రభవ సమ్మోదవాదశుక ప్ర
ముఖపతంగ కోలాహలంబునునై మధుమాసంబు సర్వజన
మనోహరంబై నిఖిలవనపాదపంబుల నలంకరించె. నయ్యా
వసరంబున నజామిళుండు పితృనిర్దేశంబునం గుశసమిత్పు
ష్పఫలార్థంబు వనంబున కరిగి తిరిగి వచ్చుసమయంబున
నొకక్కలతాభవనంబున. 95

క. బద్ధానురాగ యై స్మర
యుద్ధంబున కలరుబుద్ధి ♦ నురుకామకళా
సిద్ధ యగు వృషలితోఁ బ్రియ
వృద్ధిం దగఁ గూడియున్న ♦ విటు నొరు గాంచెన్. 96

క. భటుసిన్ రతిశాస్త్రకళా
ర్భటునిన్ పరయౌవనాను ♦ భవమదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛాపసం
ఘటునిన్ విగతాంబరోరు ♦ కటునిన్ వటునిన్. 97

శా. హాలాఘూర్ణితనేత్రతో మదనతం ♦ త్రారంభసంరంభతో
ఖేలాపాలన యోగ్యభూవిభవతోఁ ♦ గీర్ణాల శాజాలతో
హేలాలింగనభంగి వేషవతితో ♦ నిచ్ఛావతీమూర్తితోఁ
గేళిం దేలుచునున్న వానిఁగనెఁబుంఖీభూతరోమాంచుఁడై.

క. కలికి వరుమదనకదనపుఁ
బలుకుల కలకలము బెడఁగు ♦ వహుమేఖలముు
వ్వాలరవళిఁ దగిలి గతిఁ గొప
గలకంఠి రతంబు సలుపు • గమకముఁ గనియెన్. 99
క. కవవకనై పదనూపుర
రవరవ లాగుబ్బుకొన్న రతిపతి గతులం
జివచివ నై విటుచెవులకు
రనళిన్ రతిసల్పు రతుల • రవరవగసియెన్. 100
చ. కురులళితంబుపైనెగయన్ ♦ గ్రొమ్ముసిపిడఁగగుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ గటి ♦ సంగతి మేఖల తాళగింపస
త్కరవరకంకణావళులు ♦ గజ్జిలఁ గొనసియాడ మీఁదుగా
మరునిపినోదముల్ సలిపె• మానిని యౌవనగర్వరేఖతోన్
క. మవ్వపుసుకుమారాంగిని
జవ్వని నుపగూహనాది • సముచిత రతులన్
నివ్వటిలు దాసి గనిఁ మది
నువ్విళ్లూరంగ మన్మ • థోద్దీపనుఁడై.

తరలము.

బహుళదృక్పరిపాక మోహని • బద్ధుఁడౌచు మనంబులో
సహజకర్మము వేదశాస్త్రము • సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహితచిత్తము పట్టి పట్టఁగ • నేరఁ డయ్యె సదామనో
గహనమందు మరుండు పావకు ♦ కైవశిన్ జరియింపఁగాన్.
శా. ఆ లీలావతి గండపాళికలపై • హాసప్రసాదంబుపై.
నాలోలాలక పఙ్క్తిపై నళికపై ♦ నాకర్ణరంధ్రాగత్యాతిపై •

హాలాహాదికుచద్వయోరు కటిపై • నిచ్చల్ పిసాళింపఁగా
జాలింబొందుచునాత్మఁగుందుచుమనో•జాతానలోపేతుఁడై

తే. మఱి కులాచారవర్తన • మాలు చేసి
పరఁగు పితృక్రియలు దాని • పాలు జేసి
సాధులక్షణగుణ వృత్తిఁ • జాలు సేసి
లోలలోచనపసఁ జెంది • లోలుఁ డయ్యె. 105

క. శ్యామః గుసుమాస్త్రఖేలన
కామ, కులస్త్రీలలామఁ • గమనీయగుణ
స్తోమ నిజభామనొల్లక
ధామమున నటింపఁ గ్రించు • దన మొదఁ బొడమన్. 106

ఉ. బంధుల దిట్టి సజ్జనుల • బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెన్
బందెలఁ సుట్టి యారములు • పట్టిపథంబులు గొట్టిదిట్టయై
నిందలఁ గోరి సాధులకు • నిందితుఁడై గడించుచిత్తమా
సుందరికిచ్చిమచ్చికలు • సొంపెదఁగూర్చివసించెదత్పురన్.

సీ. సముచితశ్రుతిచర్చఁ • జర్చింప నొల్లక
సతికుచద్వయచర్చఁ • జర్చ సేయుఁ
దర్కకర్కశపాఠ • తర్కంబు గాదని
కలికితోఁ బ్రణయత • ర్కంబు సేయు
స్మృతిపదవాక్య సం •గతి గాక తత్సతి
పదవాక్యసంగతి • పరఁగఁ జేయు
నాటకాలంకార • నైపుణం బుడిగి త
న్నాటకాలంకార • నాటిఁ దిరుగు

తే. బరఁగఁ జిరకాల మీరీతిఁ • బాపనియతి
రమణ దాసీకుటుంబ భా • రము వహించి
యదికుటుంబిని గాఁగఁ బా • పాత్ముఁడగుచు
నశుచియును దుష్టవర్తనుఁ • డయిమెలంగె. 108

క. అటుగానఁ బాపకర్ముని
గుటిలుని సుజనార్తు ధూర్తుఁ • గ్రూరుని నే మా
రటమునఁ గొని యేగెద మం
తట దండమువలన నితఁడు • ధన్యత నొందున్. 109

వ. ఇటు పలుకుచున్న యమదూతల వారించి నయకోవిదు
లయిన భగవద్దూత లిట్లనిరి. 110

క. అవురా ధర్మవివేక
ప్రవరులపస గానఁబడియెఁ • బాపము పుణ్యో
ద్భవుల యదండ్యు లదండన
వివరంబొనరింపఁబడియె • విధి యెఱుఁగమిచేన్.

చ. సములును సాధులున్ విహిత • శాసనులున్ దయాళురున్ శుచో
త్తములును నైనయట్టితలి • దండ్రులు బిడ్డలకెగ్గు సేయుచోఁ
గ్రమమెఱిఁగి వారలెవ్వరికిఁ • గైకొనికుయ్యిడఁజాలువారు సం
భ్రమమున మీమనంబులఁ దిరంబుగఁ జర్చయొనర్చిచూడుఁడా

ఆ. ఎఱుక గలుగువార • లేదియొనర్చిన 111
నదియె చేతు రితర • మయినవారు
వారు సత్య మిది దని • వచియింప లోకంబు
తత్ప్రవర్తనమునఁ • దగిలియుండు. 113

ఆ. నిమ్మఁ దొడలమీఁద • నిద్రించు చెలికాని
నమ్మఁదగినవాఁడు • నయము విడిచి
ద్రోహబుద్ధిఁజంపఁ • దొడసునే యెంతైనఁ
బ్రీతి లేక ధర్మ • దూతలార. 114

ఆ, చిత్త మెల్ల నిచ్చి • చెలితనంబున వచ్చి
నచ్చి కలయ మెచ్చి • నమ్మువాని
గరుణ గలుగువాఁడు • కడుసౌమ్యుఁ డగువాఁడు
చింత సేయ కిట్లు • చెఱుపనేర్చు. 115

వ. అదియునుం గాక. 116

ఉ ఈతఁడు కోటిసంఖ్యలకు• నెక్కుడు పుట్టువులందుఁ బుట్టియా
యాతము లైన పాపనివహంబుల నన్నిటిఁ బాఱఁదోలి ప్ర
ఖ్యాతమతిన్ మహామరణకాలమునన్ హరిపుణ్యనామసం
భూతసుధామయాద్భుతవి•భూతిక రాక్షరసంగ్రహంబునన్

సీ. బ్రహ్మహత్యానేక • పాపాటవుల కగ్ని
కీలలు హరినామ • కీర్తనములు
గురుతల్పకల్మష • క్రూరసర్పములకుఁ
గేకులు హరినామ • కీర్తనములు
తపనీయచౌర్యసం • తమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ • కీర్తనములు
మధుపానకిల్బిష • మదనాగసమితికిఁ
గేసరుల్ హరినామ • కీర్తనములు

తే. మహితయోగోగ్రనిత్యస • మాధివిధుల
నలరు బ్రహ్మాదిసురులకు • నందరాని

భూరినిర్వాణసామ్రాజ్య ♦ భోగభాగ్య
ఖేలనంబులు హరినామ ♦ కీర్తనములు. 118

సీ. ముక్తికాంతైకాంత ♦ మోహనకృత్యముల్
కేలిమై హరినామ • కీర్తనములు
సత్యలోకానంద • సౌభాగ్యయుక్తముల్
కేలిమై హరినామ • కీర్తనములు
మహితనిర్వాణసా • మ్రాజ్యాభిషిక్తముల్
కేలిమై హరినామ • కీర్తనములు
బహుకాలజవితత ♦ పఃఫలసారముల్
కేలిమై హరినామ • కీర్తనములు

తే. పుణ్యమూలంబు లనపాయ • పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన • హారణకరము
లాగమాంతోపలబ్ధంబు • లమృతసేవ
లంర్తశుభములు హరినామ • కీర్తనములు. 119

క. నామంబుపుణ్యమార్గ
స్థేమంబు మునీంద్రసాంద్ర ♦ చేతోసరసీ
ధామంబువిష్ణునిర్మల
నామంబుఁదలంచువాఁడు • నాథుఁడు గాఁడే. 120

క. డెందంబు పుత్రువలనం
జెందిన దని తలఁపవలదు • శ్రీపతిపేరే
చందమునఁబలుకఁగలిగిన
నందకధరుఁడందుఁగలఁడు • నాథుండగుచున్. 121

ఆ. బిడ్డపేరుపెట్టి • పిలుచుట విశ్రామ
కేళినైనమిగులఁ • గేలినయినఁ
బద్యగద్యగీత • భావార్థములనైనఁ
గమలనయనునుఁదలఁపఁ • గలుషహరము. 122

ఉ. కూలినచోటఁ గొట్టుపడి • కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోటసర్పముఖ • పీడలనందినచోటనార్తులై
తూలినచోటవిష్ణు భవ • దూరునిఁ బేర్కొని రేని మీవదఁన
కాలునియాతనాహితతిఁ • గానరుపూనరుదుఃఖభావముల్.

సీ. అతిపాపములకుఁ బ్ర • యత్నపూర్వకముగఁ
దనుపాపముల శమి • తంబుగాఁగ
సన్మునివరులచే • సంపాద్యమైయుండు
నిర్మలం బగు పాప • నిష్కృతంబు
క్రమరూపమున నవి • శమనంబు లగుఁ గాని,
తత్పాపచయములు • దలఁప లేవు
సర్వకర్మంబుల • సంహార మొనరించి,
చిత్తంబునకుఁ దత్త్వ • సిద్ధినొసఁగు

ఆ. నొసర నీశుసేవ • యోగిమానససరో
వాసుసేవ హేమ • వాసుసేవ
వేదవేద్యుసేవ • వేదాంతవిభుసేవఁ
బరమపురుషుపాద • పద్మసేవ. 124

క. హరి నెఱుఁగని యాబాలుకు
హరిభక్తులతోడఁ గూడ • హరి యన రెండున్

సరియై దోషము లడఁచుచు
గరువలితో నగ్నిదృణముఁ • గాల్చినభంగిన్. 125

ఉ. ఆరయ వీర్యవంతమగు • నౌషధమెట్లు యదృచ్ఛగొన్నద
చ్చారుగుణంబురోగముల • జయ్యనఁ బాపెడుమాడ్కిఁబుణ్యవి
స్ఫారుని నంబుజోదరునిఁ • బామరుఁ డజ్ఞుఁడవజ్ఞఁబల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబు జూపెడున్.

క. ధృతి దప్పినతఱిని బురా
కృతమున గాకట్లుదోఁచుఁ • గేశవుఁడు మదిన్
మితి లేనిజగము దాల్చిన
యతఁడొక్కని మనములోన • నడఁగెడువాఁడే.

మ. నిరతంబై నిరవద్యమై నిఖలచి • న్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై • నిర్దోషమైనట్టి శ్రీ
హరినామస్మరణామృతంబితఁడు ప్రత్యక్షంబుసేవించెఁదా
మరణాంతంబున నిట్టి సజ్జనుని ధర్మంబేల వ్యర్థంబగున్.

వ. అని యిట్లు భగవద్దూతలు భాగవత ధర్మంబు నిర్ణయించి బ్రాహ్మణుని నతిఘోరంబయిన యామ్యపాశబంధ నిర్ముక్తునిం గావించి యమభటులవలనియాదలు వాపిరంత నా యమదూతలాభగవద్దూతల సంభాషణ ప్రభావంబులఁ దమ మనంబుల శాంతి నొంది భగవత్తత్త్వజిజ్ఞాసువులయి చేయునది లేక యమలోకంబునకుం జని పితృపతికి సర్వం బును నెఱింగించి రంత. 129

క. అతఁడును బాశచ్యుతుఁడై
గతభయుఁడై ప్రకృతి నొంది • కడు నుత్సవసం

గతిఁ జూచి మ్రొక్కి మఱియును
సతులిత ముద మొదవి పొదలి • హరిదాసులకున్. 130

ఆ. నిలిచి కేలు మొగిచి • పలుక నుద్యోగించి
చెలఁగుచున్న లోని • తలఁపు దెలిసి
చక్రధరునికూర్మి • సహచరు లరిగి ర
దృశ్యులగుచు దేవ • దేవుకడకు. 131

క. వేదత్రయసంపాద్యము
మోదంబు గుణాశ్రయంబు • మొగి భగవద్ధ
ర్మాదేశం బగు తద్భట
వాదంబు నజామిళుండు • వదలక వినుచున్. 132

క. శ్రీమన్నారాయణపద
తామరసధ్యానసలిల • ధౌతమహాఘ
స్తోముండై సద్భక్తిక
ధాముం బగు చుండెఁ దెలిసి • తత్క్షణమాత్రన్. 133

క. బరవసమున నెక్కటిన
దురితంబులఁ దలఁచి తలఁచి • తుదిఁ దాపమునన్
హరి నీశు నాశ్రయించుచుఁ
బరితాపము నొంది పలికె • బ్రాహ్మణుఁ డంతన్. 134

సీ. వృషలియం దనురాగ • వృద్ధిఁ బిడ్డలఁ గని
కులము గోదావరి • గూలఁ ద్రోచి
రచ్చల కెక్కి పెన్ • రజ్జుసేఁతల సరి
వారిలోపలఁ దల • వంపుచేసి
కర్త్రిఁజి ముదుకనై • కర్మబంధంబుల

పుట్టనై నిందల • ప్రోవనగుచుఁ
దరుణుల రోఁతలఁ • దవిలి భోగించిన
కసీఁది నాజన్మంబు • గాలిపోయెఁ

ఆ జదువు చుట్టువడియె • శాస్త్రంబు సున్నయ్యె
బుద్ధిపదువు మేసెఁ • బుణ్యమణఁగె
నీతి మట్టునడియె • నిర్మలజ్ఞానంబు
మొదలి కుడిగె బోధ • మూరిఁ బోయె. 135

క. చిక్కని చక్కని చన్నుల
మక్కువ యిల్లాలి విడిచి • మాయలుగల యా
వెక్కసఁపు మద్యపానపు
డొక్కపసాదగిలి మర్వి • టుఁడనై చెడితిన్. 136

ఉ. అక్కట ఘోరదుష్కృతమ * హానలకీలలు నన్నుముట్టి పే
రుక్కడఁగింప కిట్టిధృతి * నుండఁగనిచ్చెనహో దురాత్ముఁడన్
గ్రక్కునఁ దల్లిదండ్రుల న * కల్మషచిత్తులఁ బెద్దలన్ మహా
దిక్కునులేనివారిఁ బలు * త్రిక్కులఁ బెట్టుచుఁ బాఱఁదోలితిన్.

క. అకృతజ్ఞుఁడనై విడిచితిఁ
బ్రకృతిం గల బంధువులకు • బాల్యమున నరున్
వికృతిఁ గనకుండఁ బెంచిన
సుకృతుల మజ్జనకవరుల • శోభన కరులన్. 138

వ. అప్పుడు. 139

ఆ. పెక్కు పాతకముల • భృశదారుణంబైన
దొడ్డనరకమందుఁ • బడ్డనన్ను

నాపదలకుఁ బాపిఁ • యరికట్టి రక్షించి
రిట్టి ధర్మపురుషు • లెందువారొ. 140

శా. చోద్యంబై కలవో లె నీక్షణమునం • జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెనునన్ను నీడ్చిన మహా•వీరుల్ భృశోదగ్రలా
యుద్యోగంబులవారుపాశధరులీ•యుత్సాహముల్ మానిసం
పాద్యానేకవికారరూపకుటిల • ప్రఖ్యాతు లెందేగిరో. 141

ఉ. దారుణపాశబంధనవి • ధానములన్ నరకార్ణవంబులోఁ
గూలిన నన్ను నేఁడు సెడ•కుండ నొనర్చిన పుణ్యమూర్తులం
భోరుహనేత్రులుజ్జ్వలన•భోమణితేజులు లోచనోత్సవుల్ •
చారుదయాసమంచితప•చారులు నల్వురు నెందుఁబోయిరో. 142

మ. నను రక్షించిన పుణ్యవంతులు కన • న్నాళీకపత్త్రాక్షులం
జనసంకాశులు శంఖచక్రధరులా•జానూరుశాహుల్ స్మితా
నను లాలంబిత కర్ణవేష్టనసువ • ర్ణచ్ఛాయదివ్యాంబరుల్
ఘనకారుణ్యరసైకపూర్ణులు సమ•గ్రస్ఫూర్తి నెందేగిరో 143

వ. పాతకుండ నగు నాకు నవ్విబుధోత్తమదర్శనంబు పురా
కృత మదీయపుణ్యవిశేషంబునం గాని పొంద శక్యంబు
గాదు. తత్సందర్శనం మాత్రమున నతిసుప్రసన్నంబయి
యొప్పె. నట్లుగాకుండెనేనిఁ గలుషవర్తనంబున వృషలీ
భర్తనై యుండి మృతిఁ బొందుచున్న నాదుజిహ్వకు శ్రీ
మన్నారాయణ నామగ్రహణంబు సంభవింప నేరదు.
మఱియును. 144

ఆ. పాతకుండ జడుఁడ • బ్రహ్మఘాతుకుఁడను
మానలోభ మోహ • మత్సరుండ

నాకునెట్లు దొరకు • నారాయణునిదివ్య
నామవిమలకీర్త • నంబుమదికి. 145

సీ. దారుణమోహాంధ • కారపూరితుఁడను
హరివిస్మయస్మర • ణార్హమతినె
పంచమహాతీవ్ర • పాతకోపేతుఁడ
హరివిస్మయస్మర • ణార్హమతినె
కౌటిల్యకితవవి • కారపారీణుండ
హరివిస్మయస్మర • ణార్హమతినె
యఖిలదుఃఖైకఘో • రార్ణవమగ్నుండ
హరివిస్మయస్మర • ణార్హమతినె

తే. నిందలకునెల్లనెలవైన • నిర్గుణుండ
మందభాగ్యుండ నేనెడ • మధువిదారి
దివ్యగుణనామకీర్తన • తెలియఁగదేఁ
బూర్వసుకృతంబులేకెట్లు • పొందఁగలుగు. 146

వ అని వితర్కించి 147

మ. యతచిత్తేంద్రియమారుతుండనగుచున్ • దుత్సాంభోనర్చన్
వ్రతసంపత్తికిఁబుణ్యావృత్తికిఁజిదా • నాసోఽస్మఖాసక్తికిన్ [హరి)
యుతనిర్వాణపదానురక్తికి సుభో • ద్యోగక్రియాశక్తికిన్
ధృతిలబ్ధోత్తమముక్తికిన్ సకలధా • త్రీధుర్యసద్భక్తికిన్. 148

క. విడిచితి భవబంధంబుల
నడఁచితి మాయావిమోహ • మైనతమంబు
న్నొడిచితి నరివర్గంబులఁ
గడచితి నాజన్మదుఃఖ • కర్మార్ణవమున్. 149

క. యోషిద్రూపంబున నను
నీషణముఖగహ్వరమున ♦ నెగ్గ్రమింగి కదుర్
ద్వేషమునఁ గోఁతి జేసిన
దోషద యగు నాత్మమాయఁ ♦ దొలఁగం గంటిన్. 150

వ. అని యిట్లు వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన
నాబ్రాహ్మణుండు. 151

మ. భగవద్ధర్మపరాయణోత్తములసం ♦ భాషైకమంత్రంబులన్
మిగులన్ జ్ఞానముపుట్టిమోహభవస♦మ్మిశ్రాత్మబంధంబులం
దెగఖండించిసబంధుమిత్త్రసుతపత్నీ మోహవిభ్రాంతుఁడై
జగతీనాథురమేశుఁగృష్ణునిదయై♦శ్వర్యంబులంగోరుచున్.152

క. హరిభక్తులతో మాటలు
ధర నెన్నఁడు జెడనిపుణ్య ♦ ధనములమాటల్
వరముక్తి కాంత తేటలు
నరిషడ్వర్గంబు చోరని • యరు దగుకోటల్. 153

సీ. అనుచు నాబ్రాహ్మణుం • డతితత్త్వవేదియై
భవబంధముల నెల్లఁ ♦ బాఱఁద్రోచి
మొనసి గంగద్వార • మున కేఁగి యచ్చటఁ
బ్రబ్బిన దేవతా ♦ భవనమందు
నాసీనుఁడై యోగ • మాశ్రయించి చెలంగు
దేహేంద్రియాదుల ♦ తెరువువలన
దనుఁబాపుకొని పర ♦ తత్త్వంబుతో గూర్చి
మానుఁగా నాత్మన • మాధిచేత

ఆ. గుణగణంబుఁ బాసి ♦ కోమరొప్పినభగవ
దనుభవాత్మయుండు ♦ వాత్మఁగలిపి
రమణఁదన్ను మొదల ♦ రక్షించినట్టియా
పురుషవరులఁగాంచి ♦ పొసఁగ్రమొక్కి. 154

వ. అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబువిడిచి పుణ్యశరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన మహాపురుషకింకరులం గాంచి సముచితరోమాంచితచలచ్ఛటాపింజరిత స్వేదబిందుసందోహమిషనిష్యంద మహానందవల్లికాంకురసంకులపరిశోభితతనుండును, హార్షనికర్షమాణమానసోద్యోగయోగప్రభావోత్సాహాస్మయమందస్మితముఖారవిందకందళితుండును, నిఖిలజగజ్జేగీయమానాఖండశుభ్రప్రదశుభాకారసందర్శనసమాసాదితకుతూహలమానసుండును, నై ప్రణామంబు గావించుచు భాగీరథీతీరంబునఁ గళేబరంబు విడిచి తత్క్షణంబహరిపార్శ్వవర్తులైన దాసవరులస్వరూపంబుఁ దాల్చి యావిష్ణుసేవకులతోడం గూడి దివ్యమణిగణఖచితంబై సువర్ణమయంబైన యసమానవిమానంబెక్కి నిఖిలానంద భోగభాగ్యానుభవాతుంకితంబైన వైకుంఠనగరంబునకు శ్రీమన్నారాయణపదారవింద సేవాచరణపరిణామస్థితికిఁ జనియె. నిట్లువిప్లావితసర్వధర్ముండైన దాసీపతిగర్హితకర్మంబులచేతఁ బతితుండును నై నరకంబునంగూలు చుండి భగవన్నామగ్రహణంబున సద్యోముక్తుం డయ్యెఁ గావున. 155

క. కర్మంబు లెల్లఁ బాయును
మర్మము దెలుపంగ లేరు • మధిఁపుపేరే
పేర్మిని నొడువుటకంటెను
దుర్మదమునఁ జిత్తమెన్న • త్రోవలఁ జన్నన్. 156

ఉ. పాండవవంశపావన న్ప • పాలక యీయితిహాస మెవ్వఁడే
నొండొకభక్తిలేక వినుఁ నోర్పుమెయి బం ఠియించు నాతఁడు
ద్దండత ముక్తికామిసకిఁ • దానక మై దనుజారిలోకమం
దుండుమహావిభూతియమఁదూతలచూడక గోచరాకృతిన్ 157

తే అరయఁ బుత్త్రోపచారిత • మైనవిష్ణు
నామ మవసానకాలంబు • నను భజించి
శార్ఙ్గనిలయంబుఁ జేరె న • జామిళుండు
విష్ణు సద్భక్తిఁ దలఁచిన • నేమిసెప్ప. 158

క. కోరినవారల కెల్లను
జేరువ కైవల్యపదము • సిరివరుని మదిం
గోరనివారల కెల్లను
దూరము మోక్షాప్తి యెన్ని • త్రోవల నైనన్. 159

వ. అనినఁ బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. మునీంద్రా యాజ్ఞా
భ్రష్టుండై యమధర్మరాజు శ్రీవిష్ణుని ర్దేశకులచే విహతు

లైన భటులచేత వర్ణింపఁబడిన నారాయణుని నామప్రభావం బాకర్ణించి వారలకేమనియె. మఱియు నెన్నఁడేనియు యమదండంబు విఫలంబై పోయిన తెఱంగు గలదేని విన వలతు, నీసందేహంబుఁ బాప మహాత్మా నీవుదక్క దక్కినవారలు సమర్థులుగారని తలంచుచున్నవాఁడఁ జిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయవచనసుధాధారలం బ్రసాదింపవలయు ననిన శుకుం డిట్లనియె. 160

క. శ్రీకృష్ణభటులచేత ని
రాకృతులై యామ్యభటులు • యమునను నాత్మ
స్వీకృతవిప్రకథాక్రమ
మీక్రియముగ దెలిపిరదియు • నెఱిఁగింతుఁదగన్. 161

తే. చేరి త్రైవిధ్యమున మించు • జీవతతికిఁ
గర్మఫలములఁ దెలిపెడు • కారణులుగ
నగుచు శిక్షింతు వాగలీ • యవని మీఁద
దేవ యెందఱు గలరయ్య • తెలియవలయు. 162

క. దక్షిణదిశాధినాయక
శిక్షదగం జేయువారు • క్షితి పెక్కండ్రే
నిక్షయము నక్షయమును
సాక్షాత్తుగ రెండు నెంచు • సంపన్నమగుట. 163

తే. దట్టమైనట్టి కర్మబం • ధముల నెల్ల
నాజ్ఞ వెట్టెడువారు పై • నైకనచోట
సకల శాస్త్రత్వ మాపచార • మయ్యెఁగావె
శూరులైనట్టి మండలే • శులకుఁ బోలె. 164

ఉ. కావున నీవ యొక్కఁడవ • కర్తవు మూఁడు జగంబులందు సం
భావిత భూతకోటిఁ బరి • పాక వంశంబున శిక్ష సేయఁగా
నీవగ శాసనం బఖిల • నిర్ణయమై తనరారు చుండ నే
డీవలఁ గ్రమ్మఱింపమతి • యెవ్వడు శక్తుఁడు ధర్మపాలనా.

క. చండకరతనయ యొరులకు
దండధరత్వంబు గలదె • తగ జగమున ను
ద్దండధర వృత్తి నొత్తిలి
దండింతువు నిన్ను దండ • ధరుఁడని పొగడన్. 166

సీ. ఇట్టి నీదండంబ • యీమూఁడు జగములఁ
దెగువమై నేఁడు వ • ర్తిల్లుచుండ
మనుజలోకంబున • మహితాద్భుతాకార
సిద్ధుల మిగులఁ బ్ర • సిద్ధులైన
వారు నల్వురు వేగ • వచ్చి నిర్దేశంబు
భంగించి మమ్మంత • బారఁ ద్రోలి
మీశాసనంబున • మే మీడ్చికొని వచ్చు
క్రూరచిత్తునిఁ బుచ్చి • కొని యదల్చి

తే. పాశబంధము లీసునఁ • బట్టి తెంచి
బలిమి మిగులంగ మమ్మును • బాఱఁదోలి
యిచ్చఁ జనినారు వారు దా • మెవ్వటివార
లాదరమ్మున మాకు నేఁ • డానతిమ్ము. 167

వ. అని రని మఱియు శుకుం డిట్లనియె. నట్లు దూతలు పరి
తాపసమేతులై వలికిన దండధరుండు పుండరీకాక్షుని
చరణ కమలంబులు దనమానసంబున సన్నిహితంబులుగఁ
జేసికొని వందనం బాచరించి పరమభక్తిపరుండై వారల
కిట్లనియె. 168

సీ. కలఁడు మదన్యుండు • ఘనుఁడొకఁడు తనుండు
వెలికిఁ గానఁగరాక • విశ్వమెల్ల
వతిలీనమై మహా • ద్భుతసమగ్రస్ఫూర్తి
నుండునుగోక నూ • లున్నభంగి
దామెనఁ బశువులు • దగిలి యుండెడుమాడ్కి
నామసంకీర్తన • స్థేమగతుల
విహరించునెవ్వఁడు • విలసితమత్పూజ
లెవ్వనిపదముల • నివ్వటిల్లు

ఆ. గనుట మనుట చనుట • గల్గు నెవ్వనిలీల
లందు లోక మెవని • యందుఁబొందు

నెన్నఁబడుచుఁ బుడమిఁ • నెవ్వనినామముల్
గర్మబంధనముల • పేర్మి నడఁచు. 169

తరలము.

వినుఁడు నేనుమహేంద్రుఁ డప్పతి • వీతిహోత్రుఁడు రాక్షసుం
డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమ • లాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము • భూరిసంయమి సిద్ధులుం
మునుపె కన్గనఁజాల రెవ్వని • మూర్తి విశ్రుతకీర్తిమై. 170

క. సత్త్వేతర గుణపాశవ
శత్వంబునఁ బొంద వీరు • జలజాక్షునపై
కత్వంబు గాననోపరు
సత్త్వప్రాధాన్యులితర • జనముల తరమే. 171

చ. అభవున మేయు నవ్యయున • నంతున నారతుఁ బూని మేనిలో
నుభయము నై వెలుంగు పురుషోత్తముఁ గానరు చిత్తకర్మవా
గ్విభవగరిష్ఠులై వెదకి • వీఁటికి ప్రాణులు సర్వవస్తువుల్
శుభగతిఁ జూడనేర్చి తను • జూడఁగ నేరవి కంటిపోలికన్.

చ. పరముని భక్తలోకపరి • పాలనశీలుని దుష్టలోక సం
హరుని పతంగపుంగవుని • హరుని కూరిమినూత లాము నో
హరులు సురేంద్రవందితులు • నాహరిరూపగుణాస్వభావులై
తిరుగుచు నుందురెల్లెడల • దిక్కుల దేజము [illegible]గన్

ఉ. లెక్కకు నెక్కువైనసటు • లేని మహాద్భుత తేజమొప్పఁడా
బిక్కటిలం జరింతు రతి • భీమబలా[illegible] లా
చక్రనిధర్మ శాంతు లతి [illegible] తుండు [illegible]ల్
గ్రిక్కిఱిసి జగంబునను • కేశవసేవకరక్షణార్థమై. 174

క. నావలనను మీవలనను
దేవాసురగణమువలనఁ • ద్రిజగంబులలో
నేవగలఁ బొంద కుండఁగ
గావం గలవారు పుడమిఁ • గల వైష్ణవులన్. 175

క. భగవత్ప్రణిహితధర్మం
బగపడ దెవ్వారిమతికి • ననిమిష గరుడో
రగసిద్ధ సాధ్యనరసుర
ఖగతాపస యక్షదివిజ • ఖచరుల కైనన్. 176

క. ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు
పన్నగపతిశాయితత్త్వ • భావము మేనం
గన్నులవేల్పును దాపలఁ
జన్నమరిన వేల్పు ముదుక • చదువులవేల్పున్. 177

సీ. వరమహాద్భుత మైన • వైష్ణవజ్ఞానంబుఁ
దిరముగా నెవ్వరు • దెలియఁగలరు
దేవాదిదేవుండు • త్రిపురసంహారుఁడొండెఁ
గమలసంభవుఁడొండెఁ • గార్తికేయ
కపిలనారదులొండె • గంగాత్మజుండొండె
మనువొండె బలియుండె • జనకుఁడొండె
ప్రహ్లాదుఁడొండె నే • ర్పాటుగా శుకుఁడొండె
భాసురతరమతి • వ్యాసుఁడొండెఁ
తే. గాక యన్యులదరమె యీ • లోకమందు
నీసుబోధంబు సద్బోధ • మీపదార్థ

మీసదానందచిన్మయ • మీయగమ్య
మీవిశుద్ధంబు గుహ్యంబు • నీశుభంబు. 178

క. ఈ పన్నిద్దఱు దక్కఁగ
నోపరు తక్కొరులు దెలియ • నుపనిషదుచిత
శ్రీపతినామమహాద్భుత
దీపిత భాగవతధర్మ • దివ్యక్రమమునన్. 179

తే. ఏదిజపియింప నమృతమై • యెసఁగుచుండు
నేదిసద్ధర్మపదమని • యెఱుఁగఁదగిన
దదియె సద్భక్తియోగంబు • నలవరించు
మూర్తిమతంబు దాహరి • కీర్తనంబు. 180

తే. కంటిరే మీరు సుతులార • కమల నేత్రు
భవ్య మగు నామకీర్తన • ఫలము నేఁడు
దవిలి మృత్యుప్రపాశబం • ధములవలన
జాణతనమున నూడె న • జామిళుండు. 181

ఉ. ఏటికి జాలిఁ బొంద నరు • లీక్రియఁ గృష్ణునికీర్తనంబు పా
పాటవులన్ దహింపఁ గల • దాటకుసందియ మేలయిప్పుడీ
తూఁటరిదో షాసరిపెను • దోషియజామిళుఁడంత మొందుచుం
బాటిగవిష్ణునామనుతుఁ • బల్కుచుఁ గేవలముక్తికేఁగఁడే. 182

క. ఇంతయును దథ్యమని మది
నింతయుఁ దెలియంగ లేరు • హీనాత్ములు దు
ర్దాంతరవఘటిత మాయా
క్రాంతాత్యంత ప్రకాశ • గౌరవజ్ఞులై. 183

మంగళమహాశ్రీవృత్తము.

ఈ విధమునన్ విబుధు • లేకతమచిత్తముల
నేకతము లేక హరి నీసున్
భావమున నిల్పి తగు • భాగవతయోగపరి
పాకమున నొందుదురు వారిం
జేవలదు దండనగ • తిం జనదు మాకు గుఱు
తింపనఘముల్ దలఁగు మీఁదన్
శ్రీవరునిచక్రము వి • శేషగతిఁ గాచుసుర
సేవితులు ముక్తిఁ గను బెద్దల్. 184

ఉ. ఎవ్వరుసిద్ధసాధ్యఖచ • రేశలసత్పరిగీతగాథలం
దెవ్వరు ముక్తిభోగతల • హేమమనోహర చంద్రశాలలం
దెవ్వరు శంఖ చక్రగురు • హేతిగదారుచిరోగ్రపాణులా
మవ్వపురూపవంతులన • మానులు వోధరలోనివైష్ణవుల్.

సీ. శ్రుత్యంతవిశ్రాంత • మత్యంతరమణీయ
భగవత్ప్రసంగతుల్ • భాగవతులు
సకలసన్ముఖయోగి • జనసదానందైక
పరమభాగ్యోదయుల్ • భాగవతులు
కృష్ణపదధ్యాన • కేవలామృతపాన
పరిణామయుతులు శ్రీ • భాగవతులు
బహుపాతకానీక • పరిభవప్రక్రియా
పరుషోగ్రమూర్తులు • భాగవతులు

తే. భావతత్త్వార్థవేదులు • భాగవతులు
బ్రహ్మవాదానువాదులు • భాగవతులు

సిరులుబిదోలఁగంగనెన్నఁడుఁ • జేటులేని
పదవినొప్పారువారువో • భాగవతులు. 186

క. అదిగానవిష్ణుభక్తులఁ
గదియఁగజనవలదుమీరు • కరివరదుల స
త్పదపద్మవినతివిముఖులఁ
దుదినటంగఁ గట్టితెండు • ధూర్తులువారల్. 187

సీ. ఏకశక్కమున నైన • నిందిరారమణునిఁ
బలుకంగ లేని దు • ర్భాషితులను
గలలోన నైన శ్రీ • కాంతునిసత్పాద
కమలముల్ సూడని • కర్మదృశుల
నవ్వుచు నైనఁ గృ • ష్ణప్రసంశకుఁ జెవిఁ
దార్ప నేరని దుష్ట • ధారతులను
యాత్రోత్సవంబుల • నైననీశుని గుడి
త్రోవ ద్రొక్కఁగ లేని • దుష్పథులను

ఆ. బరమభాగవతుల • పాదధూళి సమస్త
తీర్థసారమనుచుఁ • దెలియ లేని
వారి వారివారి • వారిఁ జేరినవారిఁ
దొలుతఁ గట్టి తెండు • దూతలార. 188

ఆ. ఎల్లపాపములకు • నిల్లయినయింటిలో
బద్ధతృష్ణులగుచు • బుద్ధి దలఁగి
పరమహంసకులము • గుఱిదప్పి వర్తించు
ధూర్తజనుల దెండు • దూతలార. 189

ఆ. అరయఁ దనదు జిహ్వ • హరిపేరు నుడువదు
చిత్తమతనిపాద • చింతఁ జనదు
తలఁపఁ దమకు ముక్తి • తంగేటిజున్నొకో
సకలవిష్ణుభక్తు • లకును బోలె. 190

ఆ. పద్మనయనుమీఁది భక్తియోగంబెల్ల
ముక్తియోగమనుచు • మొదలెఱుంగు
వారి వారివారి • వారిఁ జేరినవారి
ద్రోవఁ బోవ వలదు • దూతలార. 191

వ. అని పలికె నని చెప్పి మఱియు శుకుండిట్లనియె. శ్రీకృష్ణనామకీర్తనంబు జగన్మంగళం బనియును జగన్మోహనం బనియును జగజ్జేగీయమానం బనియును నిఖిలపాపైకనిష్కృతి యనియును నిఖిలదుఃఖ నివారణంబనియును నిఖిలదారిద్ర్య నిర్మూలనం బనియును, నిఖిలమాయా గుణవిచ్ఛేదకంబనియును సుధామయంబులగు హరివీర్యంబుల నాకర్ణించువారల చిత్తంబు లతినిర్మలంబు లగు భంగిం దక్షిణ వ్రతాచరణంబులం గావనియును శ్రీకృష్ణపద పద్మంబులు హృద్పదంబుల నిలుపువార లన్య పాపకర్మంబులగు నవిద్యావ్యసనంబులం బొరయనేర రనియును నిజస్వామి యైన యమధర్మరాజు చేతఁ గీర్తింపఁబడిన భగవన్మహత్వంబు నాకర్ణించి విస్మితుడై కాలకింకరుడు నాటనుండియు వైష్ణవజనంబులం దేఱి చూడ వెఱతురు. నరేంద్రా పరమగుహ్యం బగు నీయితిహాసంబును బూర్వకాలంబున సకల విజ్ఞానగోచరుండైన కుంభసంభవుండు సకలదుఃఖనిలయంబును సకలపుణ్యనిల

యంబునునైనమలయంబునఁ బురాణపురుషుండైన పురు
షోత్తము నారాధనంబు సేయుచుండి నా కెఱింగించె.
నని చెప్పిన విని విస్మయానందహృదయుండై పరీక్షిజ్జన
పాలుండిట్లనియె. 132

క. స్వాయంభువమనువేళల
నోయయ్య సురాసురాండ ♦ జోరగనరవ
ర్గాయతసర్గము దెలిపితి
పాయక యది విస్తరించి ♦ పలుకంగదవే. 193

క. ఉత్తరకాదు కట్లడిగిన
నుత్తరమును నమ్మునీంద్రుఁ ♦ డుత్తమ చేతో
వృత్తి ముదమంది పలికెను
దత్తరపాటుడిగి వినుఁడు ♦ తాపసులారా. 194

సీ. పూని ప్రచేతసు ♦ పుత్త్రులు పదుగురు
ప్రాచీనబర్హిష ♦ ప్రఖ్యఁగలుగు
వారు మహాంభోధి ♦ వలన వెల్వడివచ్చి
తగవృక్షవృతమైన ♦ ధరణిఁ జూచి
మేదినీజములపై ♦ మిక్కిలి కోపించి
మదిలోన దీపిత ♦ మన్యులగుచు
వక్త్రంబులను మహా ♦ వాయుసంయుత మైన
యనలంబు గల్పించి ♦ యవనిజములఁ

తే. బెల్లువడఁ గాల్పవాడఁగినఁ ♦ దల్లడిల్లి
వారికోపంబు వారించు ♦ వాఁడ షోవె

బలిఁ గెజంధ్వురుఁడో మహా • భాగులార
దీనమగు వృక్షములమీఁద • వెగుటదగునె. 195

తే. మొదల వర్ధిష్ణు లగు మిమ్ము • సదయహృదయు
లగు ప్రజాపతు లనుచు స • ర్వాత్ముఁ డనియె
నట్టి మీరు ప్రజాసృష్టి • కైనవార
లీవనస్పతితతుల ద • హింపఁ దగునె. 196

సీ. ఆదికాలంబున • నాప్రజాపతి పతి
యైన లోకేశ్వరుం • డచ్యుతుండు
పద్మ నేత్రుఁడు వన • స్పతుల నోషధముఖ్య
జాతంబు విషము నూ • ర్జంబుఁ గోరి
కల్పించె నందు ము • ఖ్యం బైన యన్నంబు
నచరంబు లై నట్టి • యపద మెల్లఁ
బాదచారులకును • బా ల్వెట్టి యిరుగాల్లు
చేతులు గలిగిన • జీవతతికి

తే. పాణు లొగిలేని యాచతు • ష్పాత్తు లెల్ల
నన్నముగఁ బూని గావించె • నదియుఁగాక
నామహాభాగుఁ డచ్యుతుఁ • డాదరమున
మీకు ననఘాఖ్యవిఖ్యాతి • జోకపఱిచె.

క. నిజముగ దేవాధీశ్వరుఁ
డజుఁడు ప్రజాసర్గమునకు • ననఘుల మిమ్ముల్
సృజియించె నిట్టివారికి
కుజదహనము సేయ నెట్లు • గోరిక వోడమెన్. 198

చ. సతతమహత్త్వసత్త్వగుణ ♦ సత్పురుషస్మృతిఁ బొందరయ్య మీ
పితరులు నంబితామహులుఁ ♦ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు
ష్కృతమతమైన కోపమునఁ ♦ గిల్బిషభావము మానరయ్య సం
భృతకరుణావలోకమున ♦ భీతతరుప్రకరంబుఁ జూచుచున్.

ఉ. తప్పక యర్భకావలికిఁ ♦ దల్లియుఁ దండ్రియు నేత్ర పంక్తికిన్
ఱెప్పలు నాతికిం బతియు ♦ ఱేఁడు ప్రజావలి కెల్ల నర్థికిం
బొప్పగృహస్థు మూఢులకు ♦ నుత్తము లెన్నఁగ వీరు చుట్టముల్
ముప్పునఁ గాతలేని కడు ♦ మూర్ఖులు సుమ్మి సమస్తబాంధవుల్.

సీ. అఖిల భూతముల దే ♦ హాంతస్స్థమగు నాత్మ
యీశుఁ డచ్యుతుఁడని ♦ యెఱుఁగవలయు
నెఱిఁగి సర్వంబైన ♦ యిందిరారమణు లోఁ
జూపులఁ దనివిగాఁ ♦ జూడవలయుఁ
జూచిన విద్రూప ♦ శుద్ధాత్ములగు మిమ్ము
నెనసిన వేడ్కతో ♦ నిచ్చమెచ్చు
మెచ్చిన సర్వాత్ము ♦ మీ రెఱింగిన చోటఁ
గోపగుణంబులఁ ♦ బాప వలయుఁ

ఆ. బాపి దగ్ధశేష ♦ పాదపజాలంబు
నెయ్యమెసఁగఁ బ్రదుక ♦ నియ్య వలయు
ననఘులార మీర ♦ లస్మదీయ ప్రార్థ
నంబు పరఁగఁ జేకొ ♦ నంగవలయు. 201

క. ఇదె వృక్ష సముద్భవ యగు
మదిరేక్షణ నాప్సరసిఁ గు ♦ మారిక నిత్తున్

వదలక పత్నిం గం జేకొని
ముదమందుండు పాదపముల • మోసము వాయన్. 202

వ. అని యిట్లామంత్రణంబు సేసి మారిష యను కన్యను వారలకిచ్చి చంద్రుండు నరిగె నప్పుడు. 203

క. వారలు పర్యాయంబున
నీరేజముఖిన్ వరియించి • నెఱిరమియింపన్
ధీరుండు ప్రచేతసుం డై
వారక దక్షుండు పుట్టె • వనజజసముం డై. 204

క. ఎవ్వనిసంతానంబులు
నివ్వటిలెన్ వసుధ నెల్ల • నెఱి నా దక్షుం
డివ్వలన జగము లన్నిటం
బ్రవ్వ జలము నిలిపినట్లు • ప్రజం బుట్టించెన్. 205

ఉ. వారని నేడ్కతో దుహితృవత్సలదక్షుండు దక్షుండాత్మలో
గోరి సృజించెం గొన్నిటి నకుంఠితవీర్యము చేతం గొన్నిటిన్
బోరన ఖేచరంబులను • భూచరముఖ్యవనేచరంబులన్
నీరచరవ్రజంబు రజ • నీచరజాలదివాచరంబులన్. 206

క. నరసురగరుడోరగకి
న్నరదానవ యక్షపక్షి • నగవృక్షములం
దర మిడి సృష్టి యొనర్చెను
దిరముగ దక్షప్రజాప • తి వితతకీర్తిన్ 207

క. బహువిధముల బహుముఖముల
బహురూపము లైన ప్రజల • బహులోకములన్

బహుళముగఁ జేసి మదిలో
బహుమానము నొందఁ డయ్యెఁ • బ్రఖ్యాతముగన్. 208

తే. ఆప్రజాసర్గబృంహితం • బయిన జగము
దక్షుఁ డీక్షించి మదిలోనఁ • దాప మొంది
మఱియు జననంబు నొందించు • మతము రోసి
పరమపురుషుని నాశ్రయిం • పంగఁ దలచె. 209

వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు సాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టస్వాంతుం జేయువాఁడై.

క. మోదంబై పరిదూషిత
ఖేదంబై శాంబరీద్ధ • కిలికించితదృ
గ్భేదంబై బహుసౌఖ్యా
పాదంబై యొప్పు వింధ్య•పాదంబునకున్. 112

వ. ఇట్లు వింధ్యపాదంబున కరిగి యం దఘమర్షణం బగు తీర్థంబు సర్వదురితహారంబయి యొప్పు దాని ననుసవనంబు సేవించి యతిఘోరంబైన తపంబు సేయుచు హరిం బ్రసన్నుం జేసి హంసగుహ్యం బను స్తవరాజంబున నిట్లని స్తుతియించె.

—‡ దక్షుఁడు స్తుతియించిన హంసగుహ్యం బను స్తవరాజము. ‡—

తే. వరమునికి వందనము సేతుఁ • బరిభవించి
ము న్నవితథానుభూతికిఁ • బ్రమ్రొక్కికొందు
మెఱయు గుణములఁ దేలుని • మిత్తమాత్ర
బంధువైనట్టి వానికిఁ • బ్రణుతి సేతు. 213

ఆ. తవిలి గుణములచేతఁ • తత్త్వబుద్ధులచేత
నిగిడి కానరాని • నెలవు వాని
మొదలఁ దాన కలిగి • ముక్తిమానావధి
రూప మైనవాని • బ్రాపుఁగందు. 214

ఆ. ఎల్ల తనువులందు • నిర వొంది తనతోడఁ
బొందు సేసినట్టి • పొందుకాని
పొందు వొందలేఁడు • పురుషుండు గుణము నా
గుణుని బోలునట్టి • గుణి భజింతు.

ఉ. పూని మనంబునుం దనువు • భూతములున్ మఱి యింద్రి(యంబులుం
బ్రాణములున్ వివేకగతిఁ • బాయక యన్యముఁ దమ్ము(నెమ్మెయిం
గానఁగ నేర వా గుణని • కాయములం బఱికించు నట్టి స
ర్వానుగతున్ సమస్తహితు • నాదిను పూరుషు నాశ్రయించెదన్

వ. మఱియు ననేకవిధ నామరూపనిరూప్యం బగు మనంబునకు దృష్టస్మృతులనాశంబు వలనఁ గలిగెడు నుపరామం బగు సమాధియందుఁ గేవలజ్ఞానస్వరూపంబునఁ దోఁచు నిర్మల ప్రతీతిస్థానం బైన హంసస్వరూపికి నమస్కరింతును. దారువందు నతిగూఢం బైన వీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుం డయిన పరమపురుషుని నాత్మశక్తిత్రయంబులచేతం దేజరిల్లఁ జేయుదు. రట్టి దేవుండు సకలమాయావిచ్ఛేదకం బయిన నిర్వాణసుఖానుభవంబునం గూడి

యుచ్చరింపం గొలందిగాని శక్తిగల విశ్వరూపుండు నాకుం
బ్రసన్నుం డగుంగాక. వాగ్బుద్ధీంద్రియమానసంబులచేతం
జెప్పను నిట్టిదని నిరూపింపను నలవి గాక యెవ్వని గుణ
రూపంబులు వర్తించు, నెవ్వండు నిర్గుణుండు, సర్వంబు నెవ్వని
వలన నుత్పన్నంబగు, నెవ్వని వలన స్థితిం బొందు. నెవ్వని
వలన లయంబగు, నట్టి పరాపరంబులకుం బరమం బై
యనన్యం బై ప్రాక్సిద్ధం బై యదియ బ్రహ్మం బై యాది
కారణం బై యున్న తత్త్వంబు నాశ్రయించు. నెవ్వని
పరిభావంబు మాటలాడెడు వారలకు వాదంబు సేయు
వారలకు వివాదసంవాద స్థలంబులగుచు నప్పటప్పటికి.
మోహంబు నొందించుచుండు, నట్టి యనంతగుణంబులు
గల మహాత్మునకు నతి భక్తిం బ్రణామంబు సేయుదు.
నస్తి నాస్తి యను వస్తుద్వయనిష్ఠం గలిగి యొక్కటన
యుండి విరుద్ధ ధర్మంబులుగం గనంబడు నుపాసనాశాస్త్ర
సాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపంబడిన పరమంబు
నాకు ననుకూలం బగుం గాక. యెవ్వండు జగదను
గ్రహంబు కొఱకు జన్మకర్మంబులచేత నామరూపంబులు
గలిగి తేజరిల్లు, నట్టి యనంతుం డను భగవంతుండు
ప్రసన్నుం డగుం గాక యెవ్వండు జనులకుం బురాకృత
జ్ఞానపదంబులచేత నంతర్గతుండై మేదినిం గలుగు
గంధాది గుణంబుల నాశ్రయించిన వాయువు భంగి మెలం
గుచుండు, నా పరమేశ్వరుండు మదీయ మనోరథంబు
సఫలంబు సేయుం గాక. అనుచు భక్తిపరవశుం డయి

యుక్తి విశేషంబున స్తుతియించుచున్న దక్షునికి. భక్త వత్సలుం డైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొందె నప్పుడు. 217

సీ. భర్మాచలేంద్ర ప్ర • పాతద్వయంబునఁ
గలిగిన నీలంపు • గను లనంగ
మొనసి తార్క్ష్యుని యురు • మూఁపుపై నిడినట్టి
పదముల కాంతులు • పరిఢవింపఁ
జండ దిక్కుండల • శుండాలకరముల
కైవడి నెనిమిది • కరము లమరఁ
జక్ర కోదండాసి • శంఖ నందక పాశ
చర్మగదాదుల • సరవిఁ బూని

ఆ. నల్లమేను మెఱయ • నగుమొగం బలరంగఁ
జల్లచూపు విబుధ • సమితిఁ బ్రోవ
బసిఁడికాసెఁ బూని • బహుభూషణకిరీట
కుండలములకాంతి • మెండుకొనఁగ. 218

సీ. కుండలమణిదీప్త • గండస్థలంబులు
పూర్ణేందురాగంబు • బూనుఁగుపఱుప
దివ్యకిరీటాంత • దీప్తులం బరరమా
సతికి కౌసుంభ వ • స్త్రంబుగాఁగ
వక్షస్థలంబుపై • వనమాలమాలిక
శ్రీవత్సకౌస్తుభ • శ్రీల నెఱయ
నీలాద్రిఁ బెనఁగొని • నిలిచినవిద్యుల్ల
తలభాతిఘనకాంగ • దంబు మెఱయ

ఆ. నఖిలలోకమోహ • నాకారయుక్తుఁడై
నారదాదిమునులు • సేవసేయఁ
గదిసిసురలుగొలువ • గంధర్వకిన్నర
సిద్ధగానరవము • సెవుల నలర. 219

క. సర్వేశుఁడుసర్వాత్ముఁడు
సర్వగతుండచ్యుతుండు • సర్వమయుండై
సర్వంబు జేరికొలువఁగ
సర్వగుఁడైదక్షునకుఁబ • సన్నుండయ్యెన్. 220

వ. ఇట్లు ప్రసన్నుండయిన సర్వేశ్వరునిసర్వంకషంబును మహై శ్వర్యధుర్యంబును నయి తేజరిల్లు దివ్యరూపంబుఁ గాంచి భయంబును హర్షంబును విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పించి దెప్పిరి కప్పరపాటునం బుడమిపైనిడుసాఁగిలంబడి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చి సెలయేఱులతోఁట్టునఁ గొట్టువడి యిట్టట్టు బట్టుచాలకనిట్టవాడిచి మున్నీరు దన్ని నిలిచిన పెన్నీరునుం బోలె సర్వాంగంబులుం దొంగిలింపఁ జిత్తంబు నాత్మాయత్తంబుసేసి పిక్కటిల్లినసంతోషంబుచేతభగవంతుంబలుకను నత్యంతమంగళ సందోహాపాదకంబులైన తన్నామంబు లుగ్గడింపను నతినిర్మలంబులయిన తదీయకర్మంబులు దడవను విబుధహర్షకంబులైన తత్పౌరుషంబులు వొగడను నాత్మీయమనోరథంబు ప్రాక్కువ్వను నోపక ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతిం జూచి సర్వజీవదయాపరుండును సర్వసత్వహృదంతరస్థుండును • సర్వజ్ఞుండును గావున

నతసిభావంబు దెలిసి జగన్నాథుం డార్తపోషణంబు లైన
భాషణంబులనిట్లనియె. 221

క. మెచ్చితిఁ బ్రాచేతస తప
మిచ్చట ఫలసిద్ధి యయ్యె • నిట్లతిభక్తిన్
హెచ్చగు మద్భవవిభవము
నచ్చుపడంబొంద నెవ్వఁ • డర్హుఁడు జగతిన్. 222

ఆ. తపము సాలు నింకఁ • దగ భూతతతికి వి
భూతు లొనరుఁగాక • పొందుపడఁగ
నిదియ సుమ్ము మాకు • నిచ్చలోఁ గల కోర్కి
పొసఁగ నీదువలనఁ • బొందువడియె. 223

వ. వినుము బ్రహ్మయు భర్గుండును బ్రజాపతులును మనువు
లును నింద్రులును నిఖిలభూతంబులకు భూతిహేతువులయిన
మద్విభూతివిభవంబులు, మఱియు నాకు యమనియమాదిస
హిత సంధ్యావందనాదిరూపంబగు తపంబు హృదయంబు,
సాంగజపవద్ధ్యానరూపంబగు విద్య శరీరంబు, ధ్యానాదివిషయ
పుంవ్యాపారంబుగానుండు భావనాదిశబ్దవాచ్యంబగు క్రియ యా
కృతి, క్రతుజాతంబు లంగంబులు, ధర్మం బాత్మ, దేవతలు
ప్రాణంబులు, నిగమంబు మత్స్వరూపంబు, జగదుత్పత్తికి
నాదియందు నే నొక్కండన తేజరిల్లుచుండి బహిరంతరం
బుల వేఱొక్కటి లేక సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనం
బగుటింజేసి సంజ్ఞామాత్రుండును నవ్యక్తుండును గా నుండు
జీవునిభంగి నొక్కండన యుండుదు. నంతుండనై యనం
తగుణంబులు గల మాయాగుణంబులవలన గుణవిగ్రహం

బగు బ్రహ్మాండంబును నయోనిజుండు స్వాయంభువు నగు
బ్రహ్మయును నుదయించిరి. మదీయ వీర్యోపబృంహితుం
డయి మహాదేవుండగు నా బ్రహ్మ యసమర్థుండునుం బోలె
నకృతార్థమ్మన్యమానమనస్కుండగుచు సృజింప నుద్యమిం
చుతఱిఁ దపం బాచరింపుమని నాచేత బోధితుండై ఘో
రంబైన తపం బాచరించి తొలుత సృష్టికర్తృత్వంబు వహిం
చిన మిమ్ము సృజియించె. నంతఁ బంచజనప్రజాపతితనూజ
యగు నసిక్ని యను పేరిట వినుతి నొందియున్న యిక్క
న్యకను నీకిచ్చితి. దీనిం బత్నిఁగాఁ గైకొని మిథునవ్యవా
యధర్మంబు గలవాఁడవై మిథునవ్యవాయధర్మంబు గల
యీనాతియందుఁ బ్రజాసర్గంబు నతివిపులంబుగఁ గావిం
పం గలవాఁడవు. మఱియు నీకుఁ బిదప నీక్రమంబున నిఖిల
ప్రజలును మన్మాయామోహితులయి మిథునవ్యవాయధర్మం
బునఁ బ్రజావృద్ధిఁ బొందించి మదారాధనపరులై యుండ
గలవారని పలికి విశ్వభావనుండైన హరి స్వప్నోపలబ్ధార్థం
బునుం బోలె నంతర్ధానంబు నొందె

అప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై పాంచ
జనియగు నసిక్నియందు హర్యశ్వసంజ్ఞల వినుతిఁ జెంది
యున్న యయుతసంఖ్యాపరిగణితులైన పుత్త్రులదశసహ
స్రంబులఁ బుట్టించె. నప్పుడా ధర్మశీలురైన దాక్షాయ
ణులు పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబుకొఱకుఁ దపంబు
సేయువారై పశ్చిమదిశకుం జనియచ్చట సింధుసముద్ర
సంగమంబున సమస్తదేశమునిసిద్ధగణసేవితంబై దర్శన

స్పర్శనాలోకనమాత్రంబుననిర్ధూతకల్మషులను నిశ్చలధర్మప
రులను నిర్మలచిత్తులనుం జేయుచున్న నారాయణసరస్స
నంబరఁగు తీర్థరాజంబున నవగాహనంబుసేసి నిర్మలాంత
రంగులై పరమహంసధర్మంబునందు నుత్పన్నమతులై ప్ర
జాసర్గంబుకొఱకుఁ దండ్రియనుమతంబున నుగ్రతపంబు
సేయుచుండ వారికడకు నారదుండు వచ్చియిట్లనియె, 224

సీ. మీరతిమూఢులు ♦ మీఁదటిగతి గాన
రెన్నంగఁబసిబిడ్డ • లన్నలార
పుడమి దానంతని ♦ కడఁ బరికింపరు
ప్రజలఁబుట్టింప నే ♦ ప్రతిభ గలదు
అట్లయిన నొకటిమ ♦ హాత్ముఁడు పురుషుండు
బహురూపములు గల • భామ యొకతె
పుంశ్చలి గర్తంబుఁ ♦ బురణింప నుభయప్ర
వాహంబు గల నది • వఱలఁ గదల

ఆ. నంచ యొకటి యిరువ ♦ దైదింటి మహిమలఁ
గలిగి యుండు తెరువు • గాన రాక
వజ్రనిబిడ మగుచు • వరుసఁ దనంతన
దిరుగుఁ గాష్ఠబిలము ♦ దేటపడఁగ. 225

క. వినుఁ డందుల ననురూపము
నను బొందఁగ నెఱుఁగ కాత్మ ♦ నాత్మగురూక్తిం
గొనసాగించెద మను మి
మ్మన నేమియు లేదు మూఢు • లని తెలసి తగన్. 226

వ. అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత
నారదవాక్యంబులఁ దమలో ని ట్లని వితర్కించి. 227

తే. సాదిది క్షేత్రజ్ఞుఁ డన నతి సూక్ష్మ బుద్ధి
నరయ నజ్ఞానబంధనం బగుచు లింగ
దేహ మన నెద్ది గల దది దెలియకున్నఁ,
గలదె మోక్షంబు దుష్కర్మ గతులచేత. 228

తే. కలఁడు జగదేక సన్నుత కారణుండు
స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైన
గలుగునే ముక్తిపదము దుష్కర్మగతుల. 229

ఆ. పురుషుఁ డెట్టు లేనిఁ బూని బిలస్వర్గ
గతుఁడుఁ బోలె వర్తకంబు మాను
నట్టి బ్రహ్మ మెఱుఁగ నయ్యకు స్వర్భోగ
కర్మ గతుల నేమి గాన,బడును. 230

శా. తన్నిష్ఠాగతి లేనివానికి నన తత్కర్మప్రచారంబుచే
మున్నేమయ్యెడి నాత్మబుద్ధిగుణసమ్మోహంబునం దోఁచుచున్
వన్నెల్ వెట్టుక వింతబాగులతఱిన్ వర్తించు దార్గణ్యసం
పన్నస్త్రీయును బోలె నెల్లగతులం బ్రఖ్యాతమై యుండఁగన్.

సీ. అనువొంద సృష్టి న వ్యయముగఁ జేయుచుఁ
బ్రచురప్రవాహసం పతిత మైన
నెఱయఁ గూలం బను నిర్గమస్థానంబు
నందు వేగము గల క్రందు మాయ:

గదలి యహంకార ♦ గతివశంబునఁ జాల
వివశుఁ డై బోధకు • విఘరియైన
వానికి నీరీతి • వలవంత కర్మప్ర
చారంబులను మీఁదఁ ♦ జక్కనైన

ఆ. జన్మ మరణ ముఖ్య ♦ జాడ్యంబుతోఁ బాసి
నిఖిల సౌఖ్య పదవి ♦ నెఱసి క్రమ
మార్గమైన యట్టి • మహనీయధామంబుఁ
జిత్తమార నెట్లు ♦ సేరఁ గలఁడు. 232

తే. దాసిసంసర్గగుణములు • దప్పి నడుచు
కుచ్చితపుభార్యఁ జేకొన్న • కుమతి వోలె
దివిరి సుఖదుఃఖములఁ గూడి ♦ తిరిగిజీవ
రూపమెఱుఁగనివారికిఁ • బ్రాపుగలదె. 233

మత్తకోకిలము.

పంచవింశతితత్త్వరాశి క • పారదర్పణ మయ్యెఁ దాఁ
గొంచె మై పురుషుండు తత్త్వముఁ • గోరిపట్టగ నేర కే
మంచుఁ గించుఁ దలంచువారును • మార్గకర్మము సేయగా
మంచిలోకము వారికేటికి • మానుగా సమకూరెడిన్. 234

క. బంధానుమోక్షణక్రమ
సంధానైశ్వర్యధుర్య ♦ శాస్త్రసమగ్ర
గ్రంథంబు మాను చిద్రూ
పాంధునకును గర్మగతుల ♦ నగునే శుభముల్. 235

మత్తకోకిలము
చూడ నీజగ మంతయుం గాసఁ • జుట్టి పట్టుక లీల నే
జోడు లేక రయంబునం గుడిచి • సుట్టునట్టి స్వతంత్రముం
గూడియుండిన కాలచక్రముఁ • గోరి గూడనివారి కే
జూడఁ గల్గును గర్మసంగతిఁ • జారుమోక్షపదం బిలన్.

ఆ. జన్మహేతువైన • జనకనిర్దేశంబు
దనకుఁ జేయరాని • దనుచుఁ దెలిసి
గుణమయప్రవృత్తి • ఘోరాధ్వనిశ్వాస
నిరతుఁ డగుచుఁ జేయ • నేరఁ డతడు. 237

వ. అని తమలో విచారించి యాకుమారు లప్పుడు. 238

సీ. వినవయ్య భూపాల • మునివరేణ్యునిమాట
లనువొందఁ దలపోసి • వినయ మలర
వలగొని యతనికి • వందనంబు లొనర్చి
తిరిగి యెన్నఁడురాని • తెరువు వట్టి
చయ్యన నేగిరి • సహజసత్త్వబ్రహ్మ
మయ మైన పంకజ • నయనుపాద
పద్మమరందంబు • పానంబు సేయుచు
మత్తిల్లి నిలిచిన • మానసాళి

ఆ. పరిణమింప విష్ణుఁ • బాడుచుఁ భక్తి
సరణి మ్రోయు మహతి • సంఘటించి
నారదుండు గుణవి • శారదుం డెందేని
జనియెఁ దన్ను జగము • సన్నుతింప. 239

క. అప్పుడు దక్షుఁడు దనయులు
దప్పి మహాపథము గనుటఁ • దగ నారదుఁడే
చెప్పినఁ గప్పినశోకము
ముప్పిరిగొని చిత్తవృత్తి • మురారిం బోవన్. 240

చ. అడలుచునున్న పచ్చికమ • లాసనుఁ దూఱడిలంగ బల్కి మున్
పడసినలీలఁ బుత్త్రిల న • పారగుణాఢ్యులఁ గాంచుచున్న నా
పడఁతుకయందుఁ గ్రమ్మఱను • బల్వుర దా శబళాశ్వసంజ్ఞులన్
బెడఁగగువారిఁ బుణ్యములఁ • బేర్చినవారి సహస్రసంఖ్యలన్.

క. పుట్టించిన జనకునిమదిఁ
బుట్టినతలఁ పెఱిఁగి వారు • పూనికఁ బ్రజలం
బుట్టించు వ్రతముఁ గైకొని
గట్టిగఁ దప మాచరింపఁ • గాఁ జనిరి వెసన్. 242

వ. ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రిపంపున దపంబు సేయువారై యేతీర్థంబు తీర్థరాజంబై లసకతీర్థఫలంబుల నాలోకనమాత్రంబు ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు, నేతీర్థప్రభావంబున నగ్రజన్మలు ఫలసిద్ధిం బొందుదు రట్టి నారాయణసరస్సను పుణ్యతీర్థంబునకుం జని తదుపస్పర్శమాత్రంబున నిర్ధూతమలాశయులై. 243

శా. బ్రహ్మేంద్రాదులు నందనేరని పర • బ్రహ్మంబుఁ జింతించుచున్
బ్రహ్మానందముఁ బొంది జిహ్వాకలపై • బ్రహ్మణ్యమంత్రంబులన్

బ్రహ్మలోకవాంఛతో నిలుపుచుఁ బ్రహ్మాంబొందంచుముఁ
బ్రహ్మజ్ఞానగురుం హరిం దపమునం బాటించి దక్షబాలకుల్.

సీ. ఏకపాదాంగుష్ఠ • మిలమీఁద నవరించి
నిశ్చలకాయులై • నిక్కి నిలిచి
కరములు గీలించి • నరవి మీఁదికి నెత్తి,
గుఱుతుగాఁ బెనుబయల్ • గుట్టి పట్టి
నిశివిగాఁ గ్రూరమై • నిగిడినచూడ్కుల
గడుఁ దీవ్రభానునిఁ • బొడివి పట్టి
వసిఁ గొంతకాలంబు • వాయువు భక్షించి
యంతనుండియు నిరా • హారు లగుచు

ఆ. సకలలోకములకు • సంహారకరమును
జేర్చి దేవతలకు • భీతికరముఁ
గాఁగ ఘోరతపముఁ • గావింపఁ దొడఁగిరి
మహితచిత్తు లక్కు • మారవరులు. 245

నారదుఁడు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట.

వ. ఇట్లతిభయంకరంబైన తపంబు సేయుచు నెడసేగక ఓం నమో నారాయణాయ పురుషాయ మహాత్మనే విశుద్ధసత్త్వాధిష్ణ్యాయ మహాహంసాయ ధీమహి (పురుషుండును మహాత్ముండును నగు నారాయణునకు నమస్కారము, విశుద్ధసత్త్వాశ్రయుని పరమహంసుని ధ్యానించెదము) భగవన్మంత్రంబులు నొడువుచుఁ బ్రజాసర్గకాములై యున్న యచ్చిన్నిబాలురకడకు నారదుండు చనుదెంచి పూర్వవిధంబున బలుకుచు నిట్లనియె. భ్రాతృవత్సలులై యున్న వీరలు

వేదాంతసారంబాలుకుచున్ననావచనంబులాదరించి తోఁబుట్టువులు సనినమార్గంబునఁ జనుండెవ్వఁడేనిదనయగ్రజులుసన్న మార్గంబునందానునుందప్పక వర్తించెనేని నట్టివానినివిశేష ధర్మవెఱింగినవాఁడంద్రు, సంతతంబునుబుణ్యబంధువులైనదేవతలం గూడి సుఖం బుండుఁ డని పల్కి నారదుండు సనిరి వారలును సర్వకర్మంబుల యందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పదంబు లయిన దేవర్షి వాక్యంబుల నాశ్రయించి. 246

ఉ. అప్పుడు లజ్జతోడ శబ • ళాశ్వులు పూర్వజు లేఁగినట్టియా
చొప్పున నెన్నఁడుం దిరిగి • చూడనిత్రోవ విశేషపద్ధతిం
దప్పక పోయిరయ్యగుణ • ధాములు నేఁడునుమళ్ళరేమి నేఁ
జెప్పెద గాకరాక కడ • నేరినరాత్ములఁ బోలి భూవరా.

క. దక్షుని కాకాలంబున
లక్షితమై యుండెఁ బెక్కు • లాగుల నుత్పా
తక్షోభంబులు వానికి
రూక్షవ్యథ నొంది యాపు • రుష నాశంబుల్. 248

క. నారదకృత మని యెఱిఁగి మ
హారోషముతోడ నేఁగి • యాతనిఁ గని దుః
ఖారూఢ చిత్తుఁడై మది
నూఱడిలం దెరువు లేక • యుగ్రుం డగుచున్. 249

ఆ. మోము జేవురించ • ముడివడ బొమ్మలు
చూపు వెంటమంట • సుడిగొనంగ

బెదపులదరఁబంన్లు • పెటపెటఁ గొఱకుచు
దక్షుఁడాగ్రహించి • తపసిఁ బలికె. 250

చ. నెఱయఁగ సాధురూపమున • నీవతిబాలుర కాత్మజాతికిం
గఱకున భిక్షుమార్గ మగు • కందువ సెప్పితి వేలధూర్తవై
మఱుఁగక యుండవచ్చు నిక • మారుల నీచరితంబు వొందని
న్నొఱలఁగ ద్రోతు నాకుసమందో గ్రమహాగ్రహాశాపవహ్నులన్

దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట.

వ. అది యెట్లంటేని పితృదేవర్షి ఋణంబులు దీర్పక కర్మవిచారంబు సేయక యుండు బాలురబుద్ధిం జెఱచి వారలకు నుభయలోకంబులం బొందఁగల శ్రేయంబునకుహాని యొనర్చితి, విట్టిపాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవైయశోహానిం బొంది చరింతువుగాక. భాగవతోత్తములంధఱును సకలభూతానుగ్రహాపరవశులై యుండ నీవు స్నేహపాశ సికృంతనంబైన మిత్రభేదంబు చేయించుచు నొకరి కొకరికి జగడంబులం బుట్టింతువు గాక. ఇంతనుండి యుఁ బురుషుండు విషయతీక్ష్ణత్వంబు లనుభవించినం గాని తెలియకుండుఁ గాక. జ్ఞానంబు తనంతన తెలియునే గాని యితరులు బోధించినం దెలియకుండును. నిరంతరంబును దిరుగు నీకు నేలోకంబునను నునికిపట్టు లేకుండుఁగాక, యని నిర్దయుండై శాపంబిచ్చె. నంతనారదుండు తత్క్రోధవాక్యంబుల కలుగక యట్లకాకని సమ్మతించిచనియె. నిట్టిశాంతభావం బెవ్వనివలనం గలుగు నతండు సర్వాతీతుండయిన సర్వేశ్వరుండనంబడు.

మఱియు దక్షుండు దనమనోరథంబు విఫలంబుగాం జేసి యతిదుఃఖితమనస్కుండై పోగులుచున్నం బితామహుండు సనుదెంచి మఱియుం బ్రజాసర్గోపాయం బెఱింగించిన నా ప్రజాపతి ప్రియభామ యైన యసిక్నియందుం బితృవత్సల లైనకూంతుల నఱువదుండ్రం బుట్టించి వారిలో ధర్మునకుం బదుపురను, కశ్యపునకుం బదుమువ్వురను, జంద్రునకు నిరువదేడ్వురను భూతునకు నాంగిరసునకుం గృశాశ్వునకు నిద్దఱేసిచొప్పున నార్వురను తార్క్ష్యుండను నామాంతరంబుం దాల్చిన కశ్యపునకు మరలం గడమ నలువురను నీక్రమంబునం నిచ్చె. వారినామంబు లాకర్ణింపుము. 252

ఆ. ఎట్టిపుణ్యవతులొ • యీచేడియలు సెప్ప.
సవతు లేని యట్టి • సవతు లయ్యుం
గడుపు వడసి రెట్టి • కడుపునం బుట్టిరో
కడిది త్రిజగమెల్లం • గడుపు గాంగ. 253

వ. వార లెవ్వ రనిని భానువు లంబయుం గకుప్పుజామియు విశ్వయు సాధ్యయు మరుత్వతియు వసుపుముహూర్తయు సంకల్పయు ననంబదుగురు ధర్మునకుం బత్ను లయికొడుకులం బడసిరి. వార లెవ్వ రంటేని భానువునకు వేద ఋషభుండు పుట్టె, నతనికి నింద్రసేనుం డుదయించె. లంబకు విద్యోతుండు గలిగె, నతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి. కకుబ్దేవికి సంకటుండుపుట్టె. సంకటునకుం గీటకుండు పుట్టె, గీటకునకు దుర్గాభిమానిను లయిన దేవతలు జన్మించిరి. జామిదేవికి దుర్గభూముల కధిష్ఠాన దేవ

తలు జనియించిరి, వారికి స్వర్గుండును నందియు జన్మించిరి. విశ్వయను దానికి విశ్వేదేవగణంబు జనియించె, వారలపుత్రకు లనం బరగిరి. సాధ్య యను దానికి సాధ్యగణంబులు పుట్టె, వానికి నర్థసిద్ధి యనువాఁడు పుట్టె. మరుత్వతియను దానికి మరుత్వంతుండు జయంతుం డనువార లుదయించి, రందు జయంతుండు వాసుదేవాంశజుం డైన యుపేంద్రుం డనం బడి పినతినొందె. ముహూర్తయను దానికి సకలభూతంబులకు నాయాకాలంబులం గలిగెడు నాయాఫలాఫలంబుల నిచ్చు మౌహూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి. సంకల్ప యను దానికి సంకల్పుం డుదయించె నాసంకల్పునకు గాముండు జనియించె. వసు వసుదానికి ద్రోణుండును బ్రాణుండును ధ్రువుండును నర్కుండును నగ్నియు దోషుండును వస్తువును విభావసువు నన నెనమండ్రు వసువు లుదయంబు నొందిరి, రందు ద్రోణునకు నభిమతి యను భార్యయందు హర్షశోకభయాదులు పుట్టిరి, ప్రాణునకు భార్యయైన యూర్జస్వతియందు సహుండును నాయువును బురోజవుండును నను వారు గలిగిరి. ధ్రువునకు భార్యయగు ధరణియందు వివిధంబు లగు పురంబులు పుట్టె. నర్కునికి భార్యయగువాసనయందుఁ దర్షాదు లుదయించి, రగ్నికి భార్యయైన వసుధార యందు ద్రవిణకాదులు పుట్టిరి, మఱియుఁ గృత్తికలకు స్కంధుండు గలిగె, నా స్కంధునకు విశాఖాదు లుదయించిరి; దోషునకు శర్వరి యను భార్య యందు హరికళ శింశుమారుం డుదయించె; వస్తువునకు నాంగి

రస యందు విశ్వకర్మ యను శిల్పాచార్యుం డుదయిం బందె, నా విశ్వకర్మకు నాకృతి యను సతి యందుఁ జాక్షుషుం డను మనువు జనియించె, నామనువు వలన విశ్వేలు సాధ్యు లను వారలు పుట్టిరి; విభావసునకు నుష యను భార్యయందు వ్యుష్టియు రోచియు నాతపుండును జనించి, రందు నాతపునికిఁ బంచయాముం డను దివసాధి మాన దేవత జనియించె శంకరాంశజుండయిన భూతు నకు సురూప యను భార్య యందుఁ గోట్ల సంఖ్య లైన రుద్రగణంబు లుదయించిరిఁ మఱియు రైవతుండు నజుండు భవుండు భీముండు వాముండు నుగ్రుండు వృషా కపియు నజైకపాత్తు నహిర్బుధ్న్యుండు బహురూపుండు మహాంతుండు నను వారలును, రుద్రపారిషదులును, నతి భయంకరులయిన ప్రేతులును, వినాయకులును బుట్టి, రంగిరసుం డను ప్రజాపతికి స్వధయను భార్యయందుఁబితృ గణంబులు పుట్టిరి, సతి యను భార్యకు నధర్వ వేదాభి మాని దేవతలు పుట్టిరి. కృశాశ్వునకు నర్చి యను భార్య యందు ధూమకేశుం డను పుత్త్రుం డుదయించె, ధిషణ యను భార్యయందు వేదశిరస్సును దేవలుండును వయునుండును మనువునుం బుట్టిరి. తార్క్ష్యునకు వినత కద్రువ పతంగి యామిని యను నలువురు భార్యలందుఁ బతంగికిఁ బక్షులు పుట్టె, యామినికి శలభంబులు పుట్టె, వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనం బయిన గరుడుండును సూర్యునకు సారథియైన యనూరుండును

జనించిరి. కద్రువకుఁ బెక్కు తెఱంగులగు భుజగంబులు పుట్టెఁ. జంద్రునకుఁ గృత్తికాదినక్షత్రంబులు భార్యలైనను వారలయందుఁ జంద్రుండు రోహిణియందు మాత్రము మోహితుం డగుటం జేసి దక్షశాపంబున క్షయరోగగ్రస్తుం డై సంతానంబు వడయనేరఁడయ్యె. నంత దక్షప్రసాదం బున క్షయపీడితంబు లగు షోడశకళల మరలం బొందె. మఱియును. 254

సీ. కామితప్రదుఁ డైన • కశ్యపు కౌఁగిట,
ముచ్చట దీర్తు రే • ముద్దరాండ్రు
రఖిలలోకములకు • నవ్వలై జగ మెల్లఁ,
బూజింప నుండు రే • పుష్పబోండ్లు
బలియులయి పుత్త్రిలు • పౌత్త్రిలు త్రిజగంబు
లేలంగఁ జూతు రే • యిందుముఖులు
ముంగొంగుపసిఁడి యై • మూల్లుపుణ్యంబుల
విఖ్యాపీగుదు రెట్టి • వింతరాండ్రు

తే. వారి కులగంపకనువుల • నేరుపఱప
నదిది బిడ్డలఁ బడసిన • బిరుదుసతుల
నామములు నన్వయంబులు • నీమనంబు
పూనఁ జెప్పెద వినవయ్య • మానవేంద్ర. 255

తరలము.

అదితియుం దితిగాష్ఠయుం దను • నయ్యరిష్టయుఁ దామ్రయు
న్నదనఁ గ్రోధవశాఖ్యయుం సుర • సాఖ్యయుం సురభిం మునిం

మొదలుగాఁ దితియు న్నిళాఖ్య సు • ముఖ్యయాసరమాదిగా
ముదిత లైన్నఁగఁ గన్న సంతతి • ముజ్జగంబుల భూవరా. 256

సీ. చాలంగఁ దిమికిని • జలచరంబులు పుట్టె
శ్వాపదంబులు పుట్టె • సరమయందు
సురభికి మహిషాది • సురభులు జనియించెఁ
దామ్రికు శ్యేనగృ • ధ్రములు గలిగె
మునికి నప్సరసల • మూఁకలు జనియించెఁ
నిళ గనె భూరుహ • ములను గ్రోధ
వశ కుద్భవిల్లె దు • ర్వార సర్పంబులు
సరి యాతుధానులు • సురస కరయ

తే. నుద్భవిల్లిరి గంధర్వ • లోకమొగి న
రిష్టకు సుతుల్ దనువునకుఁ • ద్రిదశరిపులు
పదియు నేనమండ్రు నైనట్టి • విదితబలులు
వారి నామాన్వయంబులఁ • గోరివినుము. 257

వ. ద్విమూర్ధుండును శంబరుండును నరిష్టుండును హయగ్రీవుండును విభావసుండును నయోముఖుండును శంకుశిరుండును స్వర్భానుండును గపిలుండును నరుణియుఁ బులోముండును వృషపర్వుండును నేకచక్రుండును ననుతాపకుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును విప్రచిత్తియు దుర్జయుండు నను వారలు. వీరలలోన స్వర్భానునకు సుప్రభ యను కన్యక పుట్టె, దాని నముచి వివాహం బయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె. దాని నహుషు పుత్త్రుండైన యయాతి పెండ్లి

యయ్యె. వైశ్వానరునకు నుపదానవి హయశిరస పులోమ కాలక యను నలువురు పుత్త్రిక లుదయించి. రందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్ని యయ్యె. హయశిరసను క్రతువు వివాహం బయ్యె, పులోమ కాలక లను నిరువురును గశ్యప ప్రజాపతి చతుర్ముఖునివాక్యంబునఁ గైకొనియె, నాయిరువురకును సమరకోవిదు లయిన దానవులు పౌలోమకాలకేయు లనం బుట్టిరి. మఱియు నాయిరువురకు నఱువది వేలరాక్షసులు జన్మించిరి, వారు యజ్ఞకర్మంబులకు విఘాతుకులయి వర్తింప వారి నింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుండగు నర్జుండు వధించె. మఱియు విప్రచిత్తి సింహిక యను దాసియందు రాహు ప్రముఖంబుగాఁ గల కేతుశతంబును బడసె, వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి. మఱియుం బురాణపురుషుం డైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమ భాగ్యవతి యయిన యదితి గర్భంబున నుదయించె, నా యదితి వంశంబును విదితంబుగా వినిపించెద సావధానుండ వయి వినుము. వివస్వంతుండును నర్యముండును బూషుండును ద్వష్టయు సవితయు భగుండును ధాతయు విధాతయు వరుణుండును మిత్రుండును శక్రుండును నురుక్రముండును నను మనువులు జన్మించి, రందు వివస్వంతునకు శ్రాద్ధదేవుం డను మనువు సంజ్ఞాదేవియందు నుదయించె, మఱియు యముండు యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి, వెండియు సంజ్ఞాదేవి బడబా స్వరూపంబు నొంది

యశ్వనీ దేవతలం గనియె. ఛాయాదేవియందు శనైశ్చరుండును సావర్ణి యను మనువును దపతి యను కన్యకయుం బుట్టి రాతపతిని సంవరణుండు వరియించె. నర్యమునకు మాతృక యను పత్నియందుఁ జర్షణు లుదయించిరి, వారి మూలంబున మనుష్యజాతి యీలోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడె. బూషుండు భర్గునిం జూచి దంతంబులు వివృతంబులుగా నగినతండు క్రోధించి దంతంబులూడ నడచిన నాఁటనుండియు భగ్నదంతుండయి యనపత్యుండయి పిష్టాదులు భక్షించు చుండెఁ. ద్వష్టకు దైత్యానుజయైన రచనయను కన్యకకునధికబలాఢ్యుండగు విశ్వరూపుండు పుట్టె. నంత నాదేవతలు బృహస్పతి గోపించి తలంగి పోయినందమకు నావిశ్వరూపుని నాచార్యునింగా వరియించి రని చెప్పినవిని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 258

సీ. అరయంగ యోగీంద్ర • యద్భుతం బయ్యెడు
సురలపై నేటికి • సురగురుండు
గోపించె నీతండు • గురుభావమున దేవ
తల కేమి యాపదఁ • దలఁగఁ జేసె
నెఱిఁగింపు మనవుడు • నింద్రుండు త్రిభువనై
శ్వర్యమదంబున • సత్పథంబు
గానక వసురుద్ర • గణములు నాదిత్య
మరుదశ్విదేవాది • మండలములు

తే. సిద్ధచారణ గంధర్వ • జిహ్మగాది
సురలు మునులును రంభాది • సుందరాంగు
లాడఁ బాడంగ వినుతి సే • యంగఁ గొలువ
మ్రొక్కి భద్రాసనంబున • నుక్కు మీఱి.

సీ. నిండుపున్నమనాఁడు • గండరించిన చంద్ర
మండల శ్రీతోడి • మాఱు మలయు
భద్రవిద్యోతాత • పత్రంబు గ్రాలంగ
మిన్నేటితరఁగల • మేలుకొలుపఁ
గలితదివ్యాంగ నా • కరతలచాతుర్య
చామరశ్రేణులు • జాడపడఁగఁ
జింతామణిస్ఫుట • కాంతరత్నా నేక
ఘటితసింహాసనా • గ్రంబునందు

తే. నూరుపీఠంబుపై శచి • యుండ నుండి
వరుస దిక్పాలకాది దే • వతలు గొలువ
సాటి సెప్పంగ రాని రా • జసముతోడ
నింద్రుఁడొప్పారె వైభవ • సాంద్రుఁడగుచు. 260

వ. అప్పుడు. 261

క. గురుతర ధర్మక్రియా నయ
గురుఁడు మరున్మంత్ర విషయ • గురుఁడు వచశ్శ్రీ
గురుఁడు సమస్త సురావలి
గురుఁడు గురుం డరుగుదెంచెఁ • గొల్వునకు నృపా 262

చ. అమితతపఃప్రభావుఁ గురు నాత్మునిఁ గీష్పతిఁ జూచి రాజ్యసం
పద్మమద రేఖ నింద్రుఁడు వృథా తనగద్దియ లేవకుండె ని

య్యమున నెదుర్కొనఁజనక • యాసనమీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్.

క. అప్పుడు సురపతికన్నులఁ
గప్పిన సురరాజ్యమద వి • కారంబునకుం
జప్పుడు సేయక గృహమున
కప్పుణ్యుఁడు దిరిగి పోయె • నతిఖిన్నుండై. 264

చ. ఎఱుఁగమిఁ జేసినట్టి గురు • హేళనమంతనెఱింగి యింద్రుఁడ
చ్చెరువడి భీతి నొంది యతి • చింతితుఁడై తలపోసి పల్కెన
ప్పరమపవిత్రు లోకనుత • భవ్యచరిత్రు విశేషపాదపం
కరుహముఁ బూజ సేయక య • కర్మముఁ జేసితినప్రబుద్ధినై.

క. త్రిభువన విభవమదంబున
సభలో మద్గురువునకుఁ బ్ర • సన్నునకు లస
త్ప్రిభువునకు నెగ్గు సేసితి
శుభములు దొలఁగంగఁ నేన • సురభావమునన్. 266

ఆ. పారమేష్ఠ్యమయిన • పదవి నొందినభూపు
లెట్టివారికైన • లేవ వలదు
విబుధు లిట్లు సెప్పు • విధ మెన్న వారలు
ధర్మనేత్తృ లనుచుఁ • దలఁపఁబడరు. 267

ఆ. కుపథవర్తు లగుచుఁ • గుత్సితదుర్వచో
నిపుణు లయినవారు • నియతి విడిచి
తొలఁగ లేక తార • ధోగతిఁ బడుదురు
తప్పు లేక రాతి • తెప్పభంగి. 268

ఉ. కావున లోకవందితుని • కావ్యవిచారునియింటి కేఁగి త
త్పావన పాదపద్మముల•పై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి త
త్సేవ యొనర్చి•చిత్తము వ•సింపఁ బ్రసన్నునిఁ జేతునంచు నా
దేవవిభుండు వోయె నతి•తీవ్రగతిన్ గురుధామసీమకున్.

సీ. ఈరీతిఁ దనయింటి • కేతెంచు దేవతా
పతి రాక యాబృహ • స్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే • నడఁగి యదృశ్యుఁడై
పోయె నప్పుడు దేవ • పుంగవుండు
సకలంబుఁ బరికించి • జాడఁ గానక గురు
జింతించి తలపోసి • చిన్నఁ బోయెఁ
బోయినవిధ మెల్ల • దాయలు రాక్షస
వీరులు వేగుల • వారివలన

తే. దెలిసి మిక్కిలి తమలోనఁ • దెలివి నొంది
యందఱును గూడి భార్గవు • నాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తి • దట్టమైన
దేవతలమీఁదిదాడికిఁ • దెరువు వెట్టి. 270

దానవులు దేవలతో యుద్ధము సేసి దేవతల నోడించుట.

క. ధూర్తులు సమస్తకిల్బిష
మూర్తులు వరధర్మకర్మ • మోచితమార్గా
వర్తులు దుర్ణయ నిర్మిత
కీర్తులు దానవులు సనిరి • గీర్వాణులపై. 2

స్రగ్ధర

దండిం గోదండకాండో ♦ ద్ధతరథహయువై ♦ దండతండం
బుతోర్దణ్ | దండెత్తై మెండుగా న ♦ ద్దను జనికర
ముల్ ♦ దైవవర్గంబుమీదం | జండబ్రహ్మాండ భేదో
చ్ఛ్రియజయరవముల్ ♦ సర్వదిక్షోభగా ను
ద్దండ ప్రఖ్యాతలీలం ♦ దలపడిరి సురల్ ♦ దర్పలంబు నారి
తోడన్. 272

చ. మదమున దేవదానవులు♦మచ్చరు లై గడుఁ బిచ్చలించి సం
పదలకుఁ గోరి పోరునెడ ♦ భార్గవమంత్రకళావిశేషు లై
యదరులు వాఱు నస్త్రముల♦నార్చి మహాసురు లేచి యేసి పెం
గుదులుగఁ గ్రువ్వ దేవతలు♦కొల్లలకోర్వక పాఱి రయ్యెడన్.

ఆ. దనుజవీరు లేయు ♦ దారుణదివ్యాస్త్ర
దళితదేహు లగుచుఁ ♦ దలలువీడ
నోడి పాఱి రధ్వ ♦ తోఁ బ్రేతబలు లైన
త్రిదశవరులు బిట్టు ♦ దిట్టినట్లు. 274

క. ఒకమొగము గాక దివిజులు
తికమక గొని సైరు లెల్ల ♦ దీకొనఁ దమ్ముం ♦
బికవికలై నకనకలై
లుకలుకఁ బరువెత్తి రోడి ♦ లోఁగొను భీతిన్. 275

చ. దనుజులగర్వరేఖయును ♦ దానవవీరుల యుంపజోకయున్
మనుజవిశేషభోజనుల ♦ మచ్చరికంబు నిశాటకోటి యే
చినబలశౌర్యముం దమకు ♦ సిగ్గును హాః మహాభయంబు ని
ర్గుణతను జేయునుమ్మలిక ♦ గొల్లలకోర్వక పాఱిరార్తులై.

క. అమరులు విసృష్టదారుణ
సమరులు శరభిన్నదేహ • సంతాపకృశా
భ్రమరులు దైత్యకిరాతక
చమరులు కమలజుని కడకుఁ • జనిరి భయార్తిన్. 277

ఉ. ధాతకు దేవతావిభవ • ధాతకు బుణ్యజనానురాగ సం
ధాతకు సర్వలోక హిత • దాతకు వైదికధర్మ మార్గ ని
ర్ణేతకు నుల్లసద్విభవ • నేతకు సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజన • భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్.

క. ఆఖండలుండు మొదలుగ
లేఖానీకముల బ్రహ్మ • లేనగవున ని
త్యాఖండ సత్కృపారస
శేఖరవాక్యముల వారి • సేదలు దేర్చెన్. 279

వ. ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖు లయిన దేవతల
కనుకంపాతిశయ విభవంబున నభయం బొసంగి యిట్లనియె.

ఉ. నెట్టన పాపకర్మమున • నేరమిఁ జేసితి రేమి సెప్పుమీ
పుట్టిననాఁటనుండియును • బుద్ధులు సెప్పి జగంబు లేలఁగా
బట్టముఁ గట్టి పెంచిన కృ • పానిధి బ్రహ్మకళాఢ్యుఁ జే
పట్టక గుట్టు జారి సిరిఁ • బట్టునఁ దొట్టిన పొట్ల గ్రొవ్వనన్.

వ. బ్రహ్మిష్ఠుండైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురు
ద్రోహంబు సేసితిరి తద్దోషం బిపుడు మీకుఁ జేసేత శత్రు
కృతం బై యనుభవింపఁ జేసె నతిబలవంతు లయిన
మిమ్మ నతిక్షీణు లయిన రాక్షసులు జయించుట దమయా
చార్యుం డయిన శుక్రు నారాధించి తన్మంత్రప్రభావంబున

బునర్లబ్ధశ్రీయులయి యిప్పుడు మదీయం బయిన సిరియు
బు నాక్రమింపం గలవారునై మదోద్రేకంబున నెదురులే
వర్తిల్లుచున్న రక్షోనాయకులకు ద్రిదివంబుఁ గొనుట
తృణప్రాయంబభేద్యమంత్రబలంబు గల భార్గవునకు వారు
శిష్యు లగుటం జేసి విప్రగోవింద గవేశ్వ రానుగ్రహంబు
గల వారలకుఁ దక్కం దక్కినరాజుల కరిష్టంబగుం గావున
మీ రిప్పుడు త్వష్టయను మనుపుత్త్రుం డగు విశ్వరూపుం
డను ముని నిశ్చలతపోమహత్త్వసత్త్వ స్వభావుం డతని
నారాధించినమీకు నభీష్టార్థంబుల నతండు సంఘటించునెట్టి
దుర్దశల నైన నడంచునని చెప్పిన దిక్పాలకాదులు డెం
దంబులు డిందుపడి కమల గర్భుని వీడ్కొని విశ్వరూపు
కడకుం జని యిట్లనిరి. 282

తే. అన్న మే లగు నీకు ని • న్నడుగఁ గోరి
వచ్చినారము భవదీయ • వనమునకును
దండ్రులకు నేఁడు సముచి • తంబు లైన
కోర్కు లొడఁగూడఁ జేసి చే • కొమ్ము యశము. 283

క. సుతులకుఁ బితృశుశ్రూషణ
మతిపుణ్యము సేయు చుండు • నాత్మజులు గుణో
న్నతి బ్రహ్మచారు లేనియు
మతిలో గురుసేవకన్న • మఱియుం గలదే. 284

వ. అదియునుం గాక. 285

సీ. అరయ నాచార్యుండు • బరతత్త్వరూపంబు
దండ్రి దలంపఁగ • ధాతరూపు

రూపింప భ్రాత మ • రుత్పతిరూపంబు
తెలియంగఁ దల్లి భూ ♦ దేవిరూపు
భగిని కరుణ రూపు • భావంబు ధర్మ స్వ
రూపంబు దా నర్థి • రూపు మొదల
నభ్యాగతుఁడు మున్న ♦ యగ్ని దేవుని రూపు
సర్వభూతములుఁ గే • శవుని రూపు
ఆ. గాన తండ్రి వేగ • కడునార్తు లగు పిత్రు
జనుల మైన మమ్ముఁ • జల్లఁ జూచి
పరభయంబు వాపి • నిరుపమం బగు తపో
మహిమచేత మెఱసి ♦ మనుపవయ్య. 286

వ. ఇట్టి బ్రహ్మనిష్ఠుండవైన నిన్నాచార్యునింగా వరియించి భవదీయ తేజోవిశేషంబు చేత వైరివీరులం బరిమార్చెద, మాత్మీయార్థం బయిన యువిష పాదాభివందనంబు నిందితంబు గా దని వేదవాక్యంబు గలదు, గావున నీకు నమస్కరించుచున్న దేవవరులం గైకొని పౌరోహిత్యంబు సేయు మనినం బ్రహసితవదనుండై యమ్మునీశ్వరుం డిట్లనియె. 287

తే. బ్రహ్మతేజంబు వోమెఱి • ప్రార్థనంబు
ధర్మగుణగర్హితం బని ♦ తా నెఱింగి
సారిది ననుబోఁటి తపసి యీ • సురలచేతఁ
బ్రకటమఘుర్నోక్తి నేటికిఁ ♦ బలుకఁబడియె. 288

వ. విశేషించియు. 289

క. గురుధనముఁ గూర్ప నేటికి

గురుశిక్షిం దగిలి మంత్రి • కోవిదులై స
ద్గురుధర్మనిరతు లేనియు
గురువులకును శిష్యవరులై • కూర్చినధనముల్. 290

సీ. అరయ నకించను • లైనట్టివారికిఁ
దగు శిలోంఛన వృత్తి • ధనము సుమ్ము
దానిచే నిర్వర్తి • త ప్రియసాధుస
త్క్రియా గలవారలై • ప్రీతి నొంది
రది గాన సద్గృహ • స్థాచార మైన యా
చార్యత్వ మిపుడు మీ • శాసనమునఁ
గైకొంటి గురుల • కామంబు ప్రాణార్థ
వంచనములు లేక • వడి నొనర్తు

ఆ. ననుచు విశ్వరూపుఁ • డనియెడి మునిప్రతి
జ్ఞోక్తిఁ బలికె వారి • నూఱడించి
మహిత మైన తత్స • మాధిచే గురుభావ
మమరఁ జేసె దేవ • సమితి కపుడు. 291

క. భార్గవ విద్యాగుప్త
స్వర్గశ్రీద్విగుణదనుజ • సముధికసంప
ద్వర్గముల విష్ణుమాయా
నర్గళగతిఁ దెచ్చి యింద్రు • నకు నిచ్చె నృపా. 292

విద్యచేత రక్షితుఁ
డై త్రివజ్రి దురంబులోన • నసురులఁ ద్రుంచెన్.
భావింప నట్టివిద్యను
శ్రీవరమాయామతంబుఁ • జెప్పెను వారికిన్. 293

ఉ. నావుడు పాండవాన్వయుఁడు నమ్మినభక్తి జగన్నివాసు రా
జీవదళాక్షుఁ గృష్ణుఁ దన చిత్తమునన్ భజియించి పల్కెనో
దేవగణార్చితాంఘ్రియుగ దివ్యమునీశ్వర విశ్వరూపుఁడ
ప్పావన మైనవిద్య సుర పాలున కేక్రియ నిచ్చెఁ జెప్పవే.

ఉ. ఎందును రక్షితుం డగుచు నింద్రుఁడు లీలయుఁబోలె వైరిసే
నం గనుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం
జెంది సమస్తలోకములఁ జేకొని యేలె మునీంద్ర దాని నే
విందు సుఖంబుఁ గందు నిఁక విన్నను సంతసమందఁ బల్కవే.

శ్రీమన్నారాయణకవచప్రారంభము.

క. వరనారాయణకవచము
నరిభీకరవజ్రకవచ మాశ్రితసంప
త్పరిణామకర్మకవచము
పురుహూతున కెట్లు మౌని బోధించెఁ దగన్. 296

వ. అనినం బరీక్షిజ్జనపాలునకు మునినాథుం డిట్లనియె.

సీ. వినవయ్య నరనాథ మునినాథుఁ డింద్రున
కనువొందఁ నారాయ ణాఖ్యమైన
కవచంబు విజయసంక ల్పంబు నప్రమేయ
స్వరూపంబు మ హాఫలంబు
మంత్రగోప్యము హరి మాయావిశేషంబు
సాంగతతోడనె యుంగఁ జెప్పె
దాని నే వినుపింతుఁ బూని తదేకాగ్ర
చిత్తంబుతోడుత్తఁ జిత్తగింపు

తే. మునర ధౌతాంఘ్రిపాణియై • యుత్తరంబు
ముఖముగా నుత్తమాసన • మున వసించి
కృతనిజాంగకరన్యాస • మతిశయిల్ల
మహిత నారాయణాఖ్య వ • ర్మము నొనర్చె. 298

వ. ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను జాను వులను నూరువులను నుదరంబునను హృదయంబునను నురంబునను ముఖంబునను శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకంబైన ఓం నమో నారాయణాయ యను నష్టాక్షరీమంత్రం బుపన్యాసంబు సేసి ద్వాదశాక్షరవిద్యచేతం గరన్యాసంబు సేసి మంత్రిమూర్తియై భగవచ్ఛబ్దవాచ్యంబైన బ్రణవాదియకారాంత మగు ఓం విష్ణవే నమః అను మహామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠ సర్వసంధులయం దుపన్యసించి మఱియు హృదయంబున నోంకారంబు వికారంబు మూర్ధంబున షకారంబు భ్రూమధ్యంబునందు ణకారంబు శిఖయందు వేకారంబు నేత్రంబులయందు నకారంబు సర్వసంధులయందు మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించెనేని మంత్రమూర్తియగు మఱియును నస్త్రియఫట్టను మంత్రంబున దిగ్బంధనంబు సేసి పరమేశ్వరునిం దనభావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియుఁ నగు షట్ఛక్తిసంయుతంబయిన నారాయణ కవచాఖ్యమైన మంత్రరాజంబు నిట్లు పఠియించె. 229

చ. గరుడునిమూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్రవ
ర్మరుచిరశార్ఙ్గఖడ్గశర • రాజితపాశగదాదిసాధనో
త్కరనికరంబు లాత్మకర•కంజములన్ ధరియించి భూతిసం
భరితమహాష్టబాహుఁడు కృ•పామతిఁ దా ననుఁ గాచుఁ గావుతన్.

ఆ. ప్రకటమకరవరుణ • పాశంబులందుల
జలములందు నెందుఁ • బొలియకుండ
గాచుఁ గాక నన్ను • ఘనుఁ డొక్కఁడై నట్టి
మత్స్యమూర్తి విద్య • మానకీర్తి. 301

క. వటుఁడు సమాశ్రితమాయా
నటుఁడు బలిప్రబలశోభ • నప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు
చటులస్థలమందు నన్ను • సంరక్షించున్. 302

చ. అడవుల సంకటస్థలుల • నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరుల నెల్ల నాకునుతి • కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూథపవ•ధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవి•ధూతదిగంతరుఁ డప్రమేయుఁడై.

చ. అరయఁగ నెల్లలోకములు • నంకిలి నొంద మహార్ణవంబులో
నురగి నిమగ్నమైన ధర • నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టియా
కిరిపతి యగ్నికల్పుఁ డురు • ఖేలుఁడు నూర్జితమేదినీ మనో
హరుఁడు గృపావిధేయుఁడు స • దాధ్వములన్ ననుఁ గా
చుఁ గావుతన్. 30

క. రాముఁడు రాజకులయి కవి
రాముఁడు భృగుసత్కులాబ్ధి • రాముఁడు సగుణ

స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రి • శిఖరములందున్. 305

సీ. తాటక మర్దించి • తపసి జన్నముఁ గాచి
హరువిల్లు విఱిచి ధై • ర్యమున మెఱసి
ప్రబలు లయినట్టి వి • రాధక బంధోగ్ర
ఖరదూషణాది రా • క్షసులఁ దునిమి
వానరవిభు నేలి • వాలి నుగ్గుగఁ జేసి
జలరాశిగర్వంబుఁ • జక్కఁ జేసి
సేతువు బంధించి • చేరి రావణ కుంభ
కర్ణాది వీరులఁ • గడిమి ద్రుంచి

తే॥ యల విభీషణు లంకకు • నధిపుఁ జేసి
భూమిసుతఁ గూడి సాకేత • పురమునందు
రాజ్య సుఖములు గైకొన్న • రామవిభుఁడు
వరుస నను బ్రోచుచుండుఁ బ్ర • వాస గతుల. 306

వ॥ మఱియు నఖిల ప్రమాదంబులయిన యభిచార కర్మంబుల వలన నారాయణుండును, గర్వంబు వలన నరుండును, యోగభ్రంశంబువలన యోగనాథుండయిన దత్తాత్రేయుండును, గర్మబంధంబువలన గణేశుండయిన కపిలుండును గామదేవుని వలన సనత్కుమారుండును, మార్గంబుల దేవహేళనంబు సేయుటవలన శ్రీహయగ్రీవ మూర్తియును, దేవతానమస్కార దేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును నశేష నిరయంబుల వలన గూర్మంబును, నపథ్యంబు వలన భగవంతుండైన ధన్వంతరియు, ద్వంద్వంబు వలన నిర్జితా

త్మ్రాకైన ఋషభుండును, జనాపవాదంబువలన నగ్నిదేవుండును, జననమరణాదులం గలుగఁ జేయు కర్మంబుల వలన బలభద్రుండును, గాలంబువలన యముండును, సర్పగణంబువలన శేషుండును, నప్రబోధంబువలన ద్వైపాయనుండును, పాషండసమూహంబువలన బుద్ధదేవుండును, శనైశ్చరువలనఁ గల్కియునై ధర్మరక్షాపరుండయిన మహావతారుండు నన్ను రక్షించుఁగాతఁ, బ్రాహ్ణ మధ్యాహ్న పరాహ్ణ సాయంకాలంబులను బ్రదోషార్ధరాత్రాపర రాత్ర ప్రత్యూషానుసంధ్యా ప్రభాతంబులను గనాద్యాయుధంబుల ధరియించి కేశవ నారాయణ గోవింద విష్ణు మధుసంహార త్రివిక్రమ వామన హృషీకేశ పద్మనాభ శ్రీవత్సధామ సర్వేశ్వర కాలమూర్తులను నామరూపంబులుగల దేవుండు నన్ను రక్షించుగాక. ప్రళయకాలానలాతితీక్ష్ణ సంభ్రమభ్రమణనిర్వక్రవిక్రమవక్రీకృత దనుజచక్రంబైన సుదర్శనప్రఖ్యానామచక్రంబు మహావాయుప్రేరితుండయి హుతాశనుండు నీరసతృణాటవులభస్మీభూతంబు సేయుభంగి భగవత్ప్రయుక్తంబునై మద్వైరిసైన్యంబుల దగ్ధంబు గావింపుము. జగత్సంహారకాల పటుఘటిత చటులమహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభి భర్జిత ఘన ఘనాంతర నిష్ఠ్యూత నిష్ఠుర కోటిశతకోటి సంస్పర్శ స్ఫురద్విస్ఫులింగ నిర్గమానర్గళ భుగభుగాయమాన మూర్తీ. విస్ఫూర్తి నారాయణకరకమల వర్తి గదాయుధోత్తమ మదీయ వైరి తేజోప తండంబుల ఖండనంబునం జండగతిం బింషి

బింషిగా కూష్మాండ వైనాయక రక్షోభూతగ్రహం
బులు చూర్ణంబులుగాఁ గొండొక వినోదంబు
సలుపుము. దరేంద్రంబవైన పాంచ జన్యంబ
సర్వలోక జిష్ణుం డయిన శ్రీకృష్ణుని నిఖిల పుణ్యైకసదన
వదన నిష్ఠ్యూత నిశ్శ్వాస సాధర వేణు సరిపూరితంబవై
యున్మత్తభూతప్రేత పిశాచవిప్రగ్రహాది క్రూరదుర్గ్ర
హంబులు విద్రాణవంబులుగా నస్మత్పర వీరమండలంబుల
గుండియలతోఁ దదీయమానినీమగ్నభరగర్భంబులు గర్భ
స్థార్భకనిర్భేదంబులుగా నవియ బ్రహ్మాండభాండభీకరం
బయిన భూరినాదంబున మోదింపు మతితీవ్రధారాదళిత
నిశాటకోటికఠోర కంఠకరాళ రక్తధారాఘాత మలీమసవిస
రంబ వైన నందకమహాసి శేఖరంబ జగదీశప్రేరితంబ వై
మద్విద్వేషి విషమవ్యూహంబుల నొండు గంషికండలుగఁ
జెండి చెండాడుము. నిష్కళంక నిరాతంక నిశ్శంక సాంద్ర
చంద్రమండలపరిమండిత సర్వాంగరక్షణ విచక్షణ ధర్మ
నిరతంబ వయిన చర్మంబ దుర్మద మద్వైరి లోకభీకరాలో
కంబులను సమాకుల నిబిడనీరంధ్రనిష్ఠురతమఃపటలపటు
ఘటనంబులం గుటిలపఱుపుము. నిఖిలపాప గ్రహంబుల
వలనను సకలనరమృగసర్పక్రోడ భూతాదులవలనను నగు
భయంబులు భగవన్నామ రూపయాన దివ్యాస్త్రంబులవల
నం బొందక యుండుఁ గాక. బృహద్రథంతరాదిసామంబుల
చేత స్తోత్రంబు సేయంబడు చున్న ఖగేంద్రుండు రక్షణ
దక్షుండై నన్ను రక్షించుఁ గాక. శ్రీహరినామరూప

వాహనదివ్యాయుధపారిషదోత్తమప్రముఖేంబు లస్మదీయ బుద్ధీంద్రియమనఃప్రాణంబుల సంరక్షించు. భగవంతుండయిన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు. జగద్వైక్యభావంబయిన ధ్యానంబు గలవానికి వికల్పరహితుండయి భూషణాయుధలింగాఖ్య లగుశక్తులందనమాయచేతధరియించి తేజరిల్లుచుండు. లక్ష్మీకాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుం గాక. లోకభయంకరాట్టహాసభాసురవదనగహ్వరుం డగు సమస్తతేజోహరణధురీణతేజఃపుంజసంజాత దివ్యనృసింహావతారుం డగు నప్పరమేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన సమస్తబహిరంతరంబుల వలన నన్ను రక్షించు చుండుగాత. యని నారాయణాత్మకకవచప్రభావం బితిహాసరూపంబున నింద్రుడు దెలిసికొని ధ్యానంబు సేసి తద్విద్యాధారణమహిమ వలన నరాతుల నిర్జించెం గావున నెవ్వరేని నిర్మలాత్ము లగువార లేతద్విద్యాధారణులై యనుదినంబును బఠియించిన నతిఘోరరణంబుల నత్యుత్కటసంకటంబులను సర్వగ్రహనిగ్రహకర్మమారణకర్మాది దుష్కర్మజన్యక్లేశంబులను వదలి యవ్యాకులమనస్కులై విజయంబు నొందుదు రదియుంగాక. 307

సీ. అతిభక్తిం గౌశికుం • డను బ్రాహ్మణుండు దొల్లి,
యీ విద్య ధరియించి • మెలమిమించి
మరుభూమియందు ని • ర్మలచిత్తుండై యోగ
ధారణంబున బిట్టు • తనువు విడిచె

దాస్థిపై నొకఁడు గంధర్వ వరేణ్యుండు
చిత్రరథాఖ్యుఁ డ • జేయుఁ డొంటి
చదలఁ జనంగఁ ద • చ్ఛాయ తదస్థిపైఁ
గదిసిన నాతఁడు • గళవళించి

ఆ. యువిదపిండుతోడ • నవవిమానముతోడఁ
దనమువిద్యతోడ • ధరణిఁ ద్రెళ్ళి
తివిచి లేవ లేక • తిక మక గుడువంగ
వాలఖిల్యమౌని • వారిఁ జూచి. 308

క. నారాయణ కవచసమా
ధారణపుణ్యాస్థి దీని • దగ్గఱ నీటం
గూరిచిన విష్ణుభక్తుల
వారక చేరంగ నెట్టి • వారికిఁ దరమే. 309

ఇంద్రవజ్రము. సంధించి నీయంగక • సంధులెల్లన్
బంధించి తన్మాత్ర • బలంబు పేర్మి
వ్నందంబు మాన్పింపఁ ద • దన్య మేదీ
సింధుప్రవాహోన్నతి • చేతఁ దీరున్.

వ. కావున నీ విప్ప డీపుణ్యాశల్యంబులు భక్తియుక్తుండవై కొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడు సరస్వతీజలంబుల నిక్షేపణంబు సేసి కృతస్నానుండవై యాచమనంబు సేసిన నీసర్వాంగబంధనంబు లుడుగు ననిన నతం డట్ల చేసి తన విమానం బెక్కి నిజస్థానంబున కరిగెంగావున.

క. అనుదినము దీనినెవ్వరు
విని రేని బఠించి రేని • విస్మయ మొదవన్

ఘనభూతజాల మెల్లను
మునుకొని వారల నుగాంచి ♦ మ్రొక్కుచు నుండున్. 312

ఆ. విశ్వరూపువలన ♦ నైశ్వర్యకర మైన
యిట్టి విద్యఁ దాల్చి ♦ యింద్రుఁ డపుడు
మూఁడులోకములకు ♦ ముఖ్యమైనట్టి శ్రీ
ననుభవించి మించె ♦ నధికమహిమ. 313

సీ. భూపాల యావిశ్వ ♦ రూపున కరుదైన
తలలు మూఁ డనువొందఁ ♦ గలిగియుండు
సారిది సురాపాన ♦ సోమపానంబులు
నన్నాద మనఁగను ♦ నమరవరుల
తోఁ గూడి భుజియించి ♦ తాఁకొని వారితో
యజ్ఞభాగంబు ప్ర ♦ త్యక్ష మొంది
కైకొను చుండి దు ♦ ష్కర్ముఁడై యాయజ్ఞ
భాగంబు రాక్షస ♦ ప్రవరులకును

ఆ. దల్లిమీఁదఁ గలుగు ♦ తాత్పర్యవశమున
దివిజవరుల మొఱఁగి ♦ తెచ్చి యిచ్చు
నది యెఱింగి యింద్రుఁ ♦ డతిభీతచిత్తుఁ డై
తనకుఁ గాని యతని ♦ తలలుద్రుంచె. 314

క. భాసురుఁడనక మహాత్ము
గ్రేసరుఁ డన కమరవిభుఁడు ♦ ప్రియకర్మగతిన్
వేసరఁ డనక మహేంద్రుఁడు
భూసురుతల లపుడు రోష ♦ మునఁ దెగ నడిచెన్. 315

వ. ఇట్లయ్యింద్రుఁ డప్రియకృత్యం బగు దేవహేళనంబును

గాంచి క్రోధంబు సహింపంజాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడిచిన సోమపానంబు సేయు శిరంబు కపింజలం బయ్యె, సురాపానంబు సేయు శిరంబు కలవింకం బయ్యె, నన్నంబు భక్షించు శిరంబు తిత్తిరి యయ్యె. నిట్లు త్రివిధపక్షిస్వరూపంబు దాల్చి బ్రహ్మహత్య యేతెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపుమని నిర్బంధింప నపుడు త్రిలోకనాయకుం డగు నింద్రుండు దానిం దప్పించుకొన సమర్థుం డయ్యు నంజలి యొగ్గి యతిభీతచిత్తుండయి యమ్మహాదోషంబు గైకొని తద్దోషం బొక్కసంవత్సరం బనుభవించు యంతం బాపుకొనువాఁడయి భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చుకొనుం డనిన భూమి తలయందుఁ జేయంబడినఖాతంబు తనంతన పూఁడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితం బైన పావనం బగునట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపం బడి పునఃప్రరోహంబు గలుగువరంబును, స్త్రీ లెల్లపుడుం దమకుఁ గామసుఖంబు గలుగునట్టి వరంబును గోరిన నతం డట్ల కా నొసంగిన నతని దుష్కృతంబు ధరణి యీరిణ విధంబునను, నుదకంబు బుద్బుదఫేనరూపంబునను, మహీరుహంబులు నిర్యాసభావంబునను, నింతులు రజోవికారంబునను నట్లు చతుర్భాగంబులం బంచికొని రంత. 316

మ. హతపుత్త్రుం డగు విశ్వరూపజనకుం డాత్వష్టదుఃఖాయుతో
ద్ధతరోషాలదహ్యమానుఁ డగుచుం దా నింద్రుపై మారణ

క్రతుహోమంబొనరింపనందుఁ బొడమెం • గల్పాంతకాకారవి
స్ఫురత్కీలానలనిష్ఠురేక్షణగుణ • క్షుభ్యత్త్రిలోకోగ్రుఁడై.

సీ. యుగముఁగ్రుంగెడునాఁడు • జగములు వోలియించు
నంతకుమూర్తిపై • నింతయనుచు
బఱపును బొడువును • బ్రతిదినంబును నెక్క-
శరపాతమంగంబు • విరివిగొనుచుఁ
గడుదగ్ధశైలసం • కాశదేహమునందుఁ
గరము సంధ్యారాగ • కాంతి బెరయ
మును గాఁకరాగిచే • గనుమించుమించులఁ
గఱకుమీసలు కచా • గ్రములు మెఱయ

తే. జండమధ్యాహ్నమార్తాండ • మండలోగ్ర
చటులనిష్ఠురలోచనాం • చలవిధూత
దళదిశాభాగుఁ డుజ్జ్వల • తరకరాళ
భీమరసునిశితదంష్ట్రోగ్రు • వదనగుహుఁడు. సం3 18

ఉ. నింగికి నేలకుం బొడవు•నిట్టలమై శిఖలందుఁ బర్వెహ
త్తుంగతరాగ్నిజాలములఁ•దొట్రిలుచుం గ్రహపంక్తి జారని
స్సంగకరాళశాతఘన•సద్ఘృణిమండ చండశూల యు
ప్పొంగుచుఁ గేలలీలఁగొని•భూమి చలింపఁగ సోలియాడుచుం

సీ. పదపడి పిరివిగా • వదనంబుఁ దెఱచుచు
నాకాశ మంతయు • నప్పళించుఁ
గడనాల్క నిగిడించి • గ్రహతారకంబుల
నయ మెల్ల దిగ్జాఱ • నాకి విసుచు

నలవోకయును బోలె • నట్టహాసము సేసి
మెఱసి లోకములెల్ల • మ్రింగఁజూచు
దసరు దిగ్దంతిదం • తములు సెక్కులువార
నుగ్రదంష్ట్రలు ద్రిప్పు • నుక్కుమిగిలి
తే. త్వష్ట బలితంపుఁ దపమునఁ • బుష్టి నొంది
యఖిలలోకంబు లెల్లఁదా • నాక్రమించి
వృత్రనామాఖ్య దేవతా • శత్రుఁడగుచు
దారుణాకారుఁడఖిల దుర్దముఁడు మెరసె
మత్తకోకిలము. అట్టివృత్రునిమీఁద దేవత • లక్కతోఁ బెనుమూఁక
నైచుట్టి ముట్టి మహాస్త్రవిద్యలు • సూపి యేపున నేయ నా
గొట్టువీరుఁడు వార లేసిన • క్రూరశస్త్రము లన్నియుం
జుట్టిపట్టుక మ్రింగి శూరతఁ • జోక నాగ్బ మహోగ్రుఁడై.
క. భక్షితదివ్యాస్త్రుం డగు
రక్షోనాయకుని సమర • రాజప్రముఖుల్
వీక్షించి వెఱచి వఱచిరి
రక్షకుఁ జింతించికొనుచు • లయ మొప్పారన్. 322
వ. ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల వృత్రాసురుం
డు మ్రింగిన నచ్చెరువడి చేయునది లేక తత్తేజోవిశేష
విభవంబునకు భయంబు నొంది కందినడెందంబునం గుం
దుచుం బురందరప్రముఖులా ర్తరక్షకుం డగు పుండరీకాక్షు
నకుం గుయ్యిడు వారలై. 424
లయగ్రాహి. వీఁడు లడుదుర్దముఁడు • వాఁడిమనకైదువులు •
పోఁడిమి చెడఁగా మెసవి • యీఁడు గనక న్నా

డేడ బ్రదుకు కింకఁ బెను • గీడు బొడమెఁ గా మనకుఁ •
దోడుపడ నొక్కరుఁడు • లేఁడు హరిదక్క గా
వేఁడుదము శ్రీధరునిఁ • గూడుదము సద్భటులఁ •
బాడుదము గీతముల • జోడుపడ నంతగా
వీఁడు చెమ్మత్రోవ దయఁ, తోడ నెత్తిఁ గించు ఘనుఁ
డోడక సురాలయము • పాడుపడ డింకన్.

క. అని తలపోయుచుఁ దమలో
మునుగుచుఁ దికమకలు గొనుచు • మురరిపుకడకున్
గునుకుచుఁ దిరుకుచు నేఁగిరి
ఘనరాక్షసుఁ గన్న కన్నుఁ • గవ బెగ్గిలఁ గా. 325

వ ఇట్లు భయార్తులై యమర్త్యవ్రాతంబు సని చనిముందట నభంగభంగరంగ దుత్తుంగడిండీరమండలసముద్దండాడంబర విడంబిత నారాయణ నిరంతర కీర్తిలతాకుసుమ గుచ్ఛస్వచ్ఛంబును ననవరత గోవింద చరణారవింద సేవాసమాకుల కలితఫలిత మహాపుణ్యఫలాయమాన సముద్దీపితావర్తవర్తితదక్షిణావర్తరుచిరశంఖమండలమండితంబును నతినిష్ఠురకఠినపాఠీనపృథురోమ రాజీవశకుల తిమితిమింగిలకర్కటకమకరకచ్ఛపమకరనక్రవక్రగ్రహగ్రహణ ఘుమఘుమాయమాన దారుణగమనవిమమిత విషమతరంగఘట్టనఘట్టితసముద్భూతశీకరనికరనీరంధ్ర తారకిత తారాపథంబును మహోచ్ఛ్రియశైలోచ్చయశిఖరాగ్రప్రవహిత దుగ్ధనిర్ఝరసమ్మార్జిత పురాణపురుష విశుద్ధవిశుద్ధాంతవిహారణధురీణవసుధాధౌతధావళ్యధగద్ధగాయమాన రమ్యహర్మ్య నిర్మాణ కర్మంబును

నతిపవిత్రగుణవిచిత్రనిజకళత్రప్రేమానందసందర్శితముకుంద
పరిస్రవదంతరంగ కరుణారసపరిమిళిత భావబంధురవిద్రుమ
వల్లీమతల్లికాంకుర శోభితంబును ప్రసిద్ధ సిద్ధ రసాంబు
వాహసంగమసముత్థితగంభీరఘోషపరిపూరితసకలరోదోంత
రాళంబును సముద్రమేఖలాఖిలప్రదేశవిలసితనవీనదుకూలా
యమానంబును హరిహరప్రముఖ దేవతానిచయపరిలబ్ధా
మృతమహైశ్వర్యదానధౌరేయమహానిధానంబును వైకుంఠ
పురపౌరవార మనోహర కామ్యఫల ఫలితమందార పారి
జాత సంతానకల్పవృక్షహరిచందనఘనవనానుకూలకూలం
బును నై యొప్పుచుఁ గుబేరభాండాగారంబునుంబోలెఁ బద్మ
మహాపద్మశంఖమకరకచ్ఛపముకుందకుందనీలవరసమగ్రంబై
విష్ణుకరకమలంబునుం బోలె సుదర్శనావర్తప్రగల్భంబయి
కైలాస మహీధరంబునుం బోలె నమృతకళాస్థాన శేఖర
పదార్పణంబై యింద్రవైభవంబునుం బోలెఁ గల్పవృక్ష
కామధేనుచింతామణిజనిత విశేషంబై సుగ్రీవసైన్యంబునుం
బోలె నపరిమితసబిడహరిసంచారంబై నారాయణోదరం
బునుంబోలె నిఖిల భువనభారభరణసమర్థంబయి శంకరు
జటాజూటంబునుం బోలె గంగాతరంగిణీ సమాశ్రయంబై
బ్రహ్మలోకంబునుం బోలెఁ బరమహంసకులసేవ్యంబయి
పాతాళలోకంబునుం బోలె ననంతభోగిభోగయోగ్యంబై
నందనవనంబునుం బోలె నైరావతమాధవీరంభాదిసంజ
ననకారణంబయి సౌదామినీనికరంబునుం బోలె నభ్రంక
షంబయి విష్ణునామకీర్తనంబునుం బోలె నిర్మలస్వభావం

బయి క్రతుశతగతుండునుం బోలె హరిపాదభాజనంబయి
యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి శ్వేతద్వీపంబు దర్శించి
యందు సకలదిక్పాలకాదిదేవతలు దేవదేవు నాశ్రయించి
యిట్లని స్తుతియించి రంత. 326

సీ. పంచమహాభూత • పరినిర్మితం బైన
ముజ్జగంబుల కెల్ల • నొజ్జ యైన
బ్రహ్మయు నేమును • బరఁగ నందఱుఁ గూడి
యెవ్వని కై పూజ • లిత్తు మెపుడు
నట్టి సర్వేశ్వరుం • డాగను వినుతుండు
సర్వాత్మకుఁడు మాకు • శరణ మగును
అతిపూర్ణ కాము న • హంకారదూరుని
సముని శాంతునిఁ గృపా • స్పదుని గురుని

తే. మాని యన్యుని సేవింపఁ • బూను నట్టి
కపటశీలుని నతిపాప • కర్మ బుద్ధి
శునకవాలంబు వట్టుక • ఘనతరాబ్ధిఁ
దరియఁ జూచుట గాదె తాఁ • దామసమున. 327

చ ఉదకమయంబునన్ వసుధ • నోడగఁ జేసితనర్చు కొమ్మునన్
వదలక యంటఁ గట్టి మను • వల్లభుఁ గాచినమత్స్య
మూర్తి సమ్మదమున మమ్ముఁ బ్రోచు నను • మానము
మానఁగవృత్రు చేతియాపద దొలఁగించి నేఁడుసురపాలుర
పాలిటి భాగ్య దైవమై.

మత్తకోకిలము. కంతు సేయుచు వాతఘాతక • రాళభంగురభంగదు
ర్దాంతసంతతి నాగరోదక • తల్ప మెయింది వసించు ధా

తంతవానిని బొడ్డుఁదమ్మిన • యాఁచి కాచిన నేర్పరిం
తెంతవాఁ డనరానివెుంటరి • యాదరించు మముంగృపన్.

తే. నిన్నధిష్ఠానమునఁ గల్గు • నీదుమాయ
ననుసరించి విశ్వంబు సృ • జన మొనర్చి
నారమీవు మాయందు ను • న్నం దెలియము
భేదబుద్ధిని గల్గుట • సాధురక్ష. 330

క. మము నుద్ధరింపఁ బ్రతియుగ
ము మనుజతిర్యగ్గివిషజ • మునిజనులందున్
సమత నవతరించుదువు ని
జమాయ నిత్యుఁడగు నీకు • శరణము దేవా. 331

తే. దేవతల మైన మేమిట్టి • దేవదేవు
సర్వలోకశరణ్యుని • శరణు చొచ్చి
బలిత మైనట్టి వీనియా • పదలఁ బాసి
మీాఁక్ శుభముల జేకొను • వార మిపుడు. 332

వ. ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన
వైకుంఠుండు ప్రసన్నుండయ్యె నప్పుడు. 333

సీ. తగు శంఖచక్రగ • దాధరుం డగువాని
శ్రీవత్సకౌస్తుభ • శ్రీలవాసిఁ
గమనీయమాణిక్య • ఘనకిరీటమువాని
దివ్యవిభూషణ • దీప్తివాని
మండితకోటీర • కుండలంబులవాని
సిరి యురస్థలమునఁ • జెలఁగువానిఁ

దనుఁబోలు సేవక • తండంబు గలవాని
జిలుఁగైన పచ్చని • వలువవానిఁ

ఆ. దెల్లదమ్మివిరులఁ • దెగడుకన్నులవాని
నవసుధాబ్ధసంపు • నవ్వువానిఁ
గనియె వెల్లువించు • కప్పురపాలుతోఁ
గన్నులందు నున్న • కఱవు దీఱ. 334

సీ. తన సేవకులలోనఁ • దడఁబడు రూపంబు
శ్రీవత్సకౌస్తుభ • శ్రీలఁ దెలుప
వికచాబ్జములతోడ • వీడ్వడు కన్నుల
కడలు దైవాఱడు • కరుణఁ దెలుప
నెల్లలోకములకు • నిల్లయినభాగ్యంబుఁ
గాఁపురం బుండెడు • కమల దెలుప
మూఁడుమూర్తులకును • మొదలైన తేజంబు
తాతఁ బుట్టించిన • తమ్మి దెలుప

ఆ. బుద్ధిఁ బోల్పరాని • పుణ్యాంబుఁ దత్పాద
కమలజనిత యైన • గంగ దెలుప
నప్రమేయుఁ డభవుఁ • డవ్యక్తుఁ డవ్యయుఁ
డాదిపురుషుఁ డఖిల • మోది యొప్పె. 335

వ. ఇట్లు జగన్మోహనాకారుం డయిన నారాయణుని కృపావలోకనాహ్లాదచకిత స్వభావ చరితులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి ఫాలభాగఘటితకీలిత కరకమలులై యిట్లనిరి. 336

ఆ. దుర్గమంబు లయిన • స్వర్గాదిఫలములఁ
బుట్టఁ జేయఁ జాలు • నట్టి గుణము
గలిగి మెఱయుచున్న • ఘనుఁడ వై నట్టి నీ
కరయ మ్రొక్కువార • మాదిపురుష. 337

సీ. దండంబు యోగీంద్ర • మండలనుతునకు
దండంబు శార్ఙ్గకో • దండునకును
దండంబు మండిత • కుండలద్వయునకు
దండంబు విస్ఫుర • ద్భండనునకు
దండంబు మత్తవే • దండరక్షకునకు
దండంబు రాక్షస • ఖండనునకు
దండంబు పూర్ణేందు • మండల ముఖునకు
దండంబు తేజఃప్ర • చండునకును

తే. దండ మద్భుతపుణ్యప్ర • ధామునకును
దండ ముత్తమవైకుంఠ • ధామునకును
దండ మాశ్రితరక్షణ • తత్పరునకు
దండ మురుభోగినాయక • తల్పునకును. 338

ఉ. చిక్కిరి దేవతావరులు • చిందఱవందఱ లైరి ఖేచరుల్
స్రుక్కిరి సాధ్యసంఘములు • సోలిరి పన్నగరాజభూమిలో
మ్రక్కిరి దివ్యకోటి గడు • మ్రగ్గిరి యక్షులు వృత్రుచేత నీ
చిక్కినవార మైన దయ • సేయుము నొవ్వక యుండ శ్రీహరీ.

క. మొదలాడిన రక్కసులకు
మొదలై మా కాపదలకు • మూలం బగుచుం

దుద మొదలు లేని రక్కసు
తుది మూపఁ గదయ్యు తుదకుఁ • దుది యైన హరీ   340

తే. అకల దిక్కుల కెల్ల ది • కైనమాకు
నొక్కదిక్కును లేదు కా • లూఁదనైన
దిక్కు గావయ్య నేఁడు మా • దిక్కుఁజూచి
దిక్కు లే కున్నవారల • దిక్కు నీవ.   341

క. నీదిక్కు గానివారికి
నేదిక్కును లేదు వెదుక • నిహపరములకున్
మోదింపఁ దలఁచువారికి
నీదికే దిక్కు సుమ్ము • నీరజనాభా.   342

తే అరయ మా తేజములతోడ • నాయుధములు
మ్రింగ భువనత్రయంబును • మ్రింగుచున్న
భీకరాకారు వృత్రునిఁ • బీఁచమడఁచి
యెల్లభంగుల మాబన్న • మీఁగు మధవ.   343

ఆ. పరమపురుష దుఃఖ • భంజన పరమేశ
భక్తవరద కృష్ణ • భవవిదూర
జలరుహాక్ష నిన్ను • శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావ • వయ్య మమ్ము.   344

వ. భగవన్నారాయణ వాసుదేవ యాదిపురుష మహానుభావ పరమమంగళ పరమకళ్యాణ నీకు నమస్కారము. పరమ కారుణికు లయిన పరమహంస లగు పరివ్రాజకులచేత నాచరితంబు లగు పరమసమాధి భేదంబులం బరిభావిత పరిస్ఫుటిత పరమహంస ధర్మంబుచేత నుద్ఘాటితతమఃకవాట

ద్వారంబునందు నపావృతాత్మ లోకంబున స్వయంజ్యోతిష్కం బగు నిజసుఖానుభవుండ వై యుందువు. నీవిహారయోగంబు దురవబోధంబు గా నీకు నుండును, నట్లగుటం జేసి సర్వాశ్రయుల మగు మాచే నపేక్షింపం బడనిదియు, మాకు సను వాయుసాహాయ్యంబునం దనరునదియు నగుణంబు నగు దేహంబును నీవ సృజించి పెంచి ద్రుంతువు. నీవు దేవదత్తుని మాడ్కి గుణవిసర్గ పతితుండ వై పారతంత్ర్యంబున స్వకృతంబు లైన శుభాశుభ ఫలంబులం బొందుదువు. నీ వాత్మారాముండ, వుపశమశీలుండవు, సమంజసధర్ముండ, వుదాసీనుండ వై తేజరిల్లుదువు. దేవా! యీరెంటను విరుద్ధంబు గనంబడదు. అపరిమితగుణ గణంబులం గలిగి స్వతంత్రుండవై తర్కింపరాని మాహాత్మ్యంబు గల నీవ యర్వాచీనవికల్పవితర్కవిచార ప్రమాణాభాసంబు లగు తర్కశాస్త్రంబుల వ్యాకులంబు లగు నంతఃకరణంబే యాశ్రయంబుగ గలిగి దురవగ్రహవాదు లైన విద్వాంసుల వివాదావసరంబులకు సమస్తమాయామయుండవై కేవలం బగు నాత్మమాయచేం గప్పంబడి యెవ్వరికిం గనంబడకుందువు. స్వరూపద్వయాభావంబునం జేసి రజ్జుఖండంబున సర్పభ్రాంతివలె సమవిషమమతుల మతంబు ననుసరింతువు. సర్వవస్తువులయందు వస్తురూపంబున నుండుచు సర్వేశ్వరుండవై సకలకారణభూతుండవై సర్వభూత ప్రత్యగాత్మవగుటం జేసి సర్వగుణావభాసోపలక్షితుండవై నీ వొక్కరుండవ పర్యవశేషితుండవగుదు. మాధవా! భిన

న్మహిమ మహామృతరస సముద్ర బిందుమాత్రా స్వాదసం
బున నిజమనో నిష్యందమాన నిరంతర సుఖవిస్మారిత దృష్ట
శ్రుతవిషయ సుఖలేశాభాసులు నేకాంతులు నగు పరమ భాగ
వతులు భవచ్చరణాంబుజ సేవాధర్మంబును విడిచి యీ
సంసారంబున మఱలం జిక్కువడరు. త్రిభువనాత్మ భవన
త్రివిక్రమ త్రిలోక మనోహరానుభావ దండధర భవదీయ
విభూతులగు దైత్య దనుజ మనుజాదులకు ననుపక్రమ సమ
యం బిదియని యెఱింగి నిజమాయా బలంబుచే సురనర
మృగ మిశ్రిత జలచరాకృతుల ధరించి యపరాధంబు
మేఱకు వారల దండింతువు, అట్టి నీవు నీవృత్రుని జయిం
పుము దీనదయాళో! పితామహా! భవచ్చరణ నళినయు
గళ ధ్యానాను బద్ధహృదయ నిగళులమును, నిజమూర్తి
ప్రకటన స్వీకృతులమును నగు మాహృదయ తాపంబును
ననుకంపానురంజిత సానురాగ విశద రుచిరశిశిరస్మితావ
లోకనంబున భవన్ముఖనిర్గతమధుర వచనామృతకళచే నడం
గింప నర్హుండవు జగదుత్పత్తిస్థితిలయనిమిత్తంబగు దివ్య
మాయావినోదివైన సకల జీవనికాయంబుల నంతర్హృదయం
బుల బ్రహ్మప్రత్యగాత్మ స్వరూపంబుల బాహ్యప్రధాన
రూపంబున దేశకాలదేహావస్థాన విశేషంబులం దదుపాదా
నోపాలంభకతలచే సర్వప్రత్యయసాక్షివై యాకాశశరీ
రుండవై సాక్షాత్పరబ్రహ్మంబవై పరమాత్ముండవై
యుండు నీకు విస్ఫులింగసంకాశులమగు మేమేమని విన్న
వించువారము. పరమగురుమూర్తీ? వివిధవృజిన సంసార

పరిశ్రమోపశమనీయంబగు భవచ్చరణ శతఫలాశచ్ఛాయం
గామంబున నాశ్రయించెద మని పెక్కువిధంబుల విను
తించి యిట్లనిరి. 345

క. భువనత్రయంబు సూచి ది
ట్టవు చెఱిచేయునది లేక • డాగెదు మూలల్
భవసంహార యటు గావున
దవిలి యమపురంబుఁ జేర్చు • త్వాష్ట్రి నికృష్టున్. 346

క. ఆయువు దేజంబును ది
వ్యాయుధములు మ్రింగె నాజి • యందుం గృష్ణా
చేయఁ గల మెద్ది చెప్పు మ
జేయుఁడు వృత్రుండు మాకుఁ • జేరునె జయముల్. 347

క. భవపాంథాశ్రయహంసా
త్మ వరిష్ఠగతీదహర ప • దసలయ కృష్ణా
నవనీరజదళనేత్రా
పవిత్ర యాద్యంతశూన్య • భవ్యసుకీర్తీ. 348

వ. అని యిట్లతి మనోహరంబులయిన వచనంబుల భక్తి పర
వశులయి వినుతి సేయుచున్న దేవతలం జూచి యప్పర
మేశ్వరుం డమృతప్రాయంబు లగు గంభీరభాషణంబుల
నిట్లనియె. 349

క. మదుపస్థానం బగు మీ
సదమలసుజ్ఞానమునకు • సంతోషమునం

బొందలె మదిఁ బ్రీతి నొందితి
వదలక నా భక్తి వాఁడవు • వ్యర్థం బగునే. 350

వ. మఱియుఁ బ్రీతుండనైన నాయందు భక్తులకుం బొందరాని యర్థంబు లేదు, విశేషించి నాయందు నేకాంతమతి యైన తత్త్వవిదుం డన్యంబులం గోరకుండు. గుణంబులయందుఁ దత్త్వవిజ్ఞానగోచరుం డైనవాఁడు విషయనివృత్తచిత్తుం డై యపథ్యంబుఁ గోరు రోగివలె సంసారమార్గంబు నిచ్ఛింపండు, కావున మీకు శుభం బయ్యెడు. దధీచియను ఋషిసత్తముండు గలం డతనిశరీరంబు మద్విద్యాతిశయ మహత్త్వంబునను దేజోవిశేషంబునను సారవంతంబై యున్నయది. అతని నడిగి తచ్ఛరీరంబుఁ బుచ్చికొనుం, డతండు పూర్వకాలంబున నశ్వినీదేవతలకు నశ్వశిరోనామం బను బ్రహ్మస్వరూపం బగు నిష్కళంకం బయిన విద్య యుపదేశించిన వారలు జీవన్ముక్తత్వంబు నొందిరి. మఱియుఁ ద్వష్టృపుత్త్రుం డైన విశ్వరూపునకు మదాత్మకం బయిన యభేద్యకవచంబు నిచ్చెఁ గావున నతండతివదాన్యుం డశ్విదేవతలచేత యాచింపఁబడి దేహంబు వచింపక మీకిచ్చు, నతని శల్యంబులు విశ్వకర్మనిర్మితంబులై శతధారలు గల యాయుధశ్రేష్ఠం బయి మత్తేజోపబృంహితం బయి వృత్రాసురశిరోహరణకారణంబులయ్యెడు, దానం జేసి మీరు పునర్లబ్ధతేజోస్త్రాయుధ సంపదలు గలిగి వెలింగెదరు, విశేషించియు మద్భక్తవరు లయినవార లేలోకంబుల నెవ్వారికి నజయ్యులు. కావున మీకు భద్రం బయ్యెడు మని

యాదేశించి భూతభావనుండైన భగవంతుండు వారల కదృ-
శ్యుండయ్యె. నప్పుడు దేవతలు దధీచునికడకుం జని య
శ్యులం బురస్కరించుకొని యిట్లనిరి. 351

ఆ. దేహి సుఖము గోరి ♦ దేహంబు ఘటియించు
దేహి విడువలేఁడు ♦ దేహ మెపుడు
దేహి యస్మదీయ ♦ దేహంబుకొఱకునై
దేహ మీఁగదయ్యె ♦ దేవతలకు 352

ఉ. ఎక్కడ నెల్లలోకముల ♦ నెవ్వరుఁ గోరనకోర్కెలేఁడు మా
కెక్కలిపాటుకై తపిరి ♦ దేహము వేఁడఁగ వచ్చినారమే
మెక్కడఁ దీవ్రకర్మగతి ♦ యెక్కడ దైవకృతంబు గాక యీ
లొక్కపుదాన మీవరుస ♦ రోయక వేఁడుదురే జగంబులన్.

క. నీచగతి యెల్లభంగుల
యాచన యని తెలిసి తగని ♦ దడుగుదు రేనిన్
యాచకవర్గములోపల
నీచకు లనఁబడరె యెంత ♦ నేర్పరు లైనన్. 354

క. అడుగంగ రానివస్తువు
లడుగరు బతిమాలి యెట్టి ♦ యర్థులు నిను నే
మడిగితిమి దేహ మెల్లను
గడు నడిగెడువారి కేడ ♦ కరుణ మహాత్మా. 355

ఉ. నావుడు నాదధీచియు మనంబున సంతస మంది నవ్వి సం
భావితవాక్యపద్ధతులఁ ♦ బలుకుచు నిట్లనెఁ బేర్మితోడ నా

దేవతలార ప్రాణులకుఁ • దేహములిమ్మృత్యుభయంబు పూనుటే
భావములం దలంపరు కృ • పామతి నెన్నఁడు మీ మనంబులన్

ఆ. ఎలమిఁ బ్రదుక నిచ్చ • యించిన వారికి
దేహమెల్లభంగిఁ • దీపు గాదె
యచ్యుతుండు వచ్చి • యర్థించె నేనియుఁ
దన్ను నిచ్చునట్టి • దాత గలఁడె. 357

వ. అదియునుం గాక. 358

సీ. అర్థంబు వేఁడెను • నర్థులు గలరు గా
కంగంబు వేఁడెడి యర్థి • గలఁడె
తగుకోరికల నిచ్చు • దానశీలుఁడు గాక
దనదేహ మీనేర్చు • దాత గలఁడె
యీనేర్పు వాఁడు దన్నిచ్చిన రోయక
చంపెనునట్టి యా • చకుఁడు గలఁడె
చంపియుఁ బోవక • శల్యంబు లన్నియు
నేఱి పంచుకపోవు • వారు గలరె

ఆ. రమణ లోక మెల్ల • రక్షించు వారికి
హింస సేయుబుద్ధి • మెట్టు వొడము
భ్రాంతి మైన యట్టి • ప్రాణంబు పై డీఫు,
తమకుఁ బోలె నెవరిఁ • దలఁప వలదె. 359

వ. అనిన దేవత లిట్లనిరి. 360

తే. సర్వభూతదయాసర • స్వాంతులకును
బుణ్యవర్తను లగు మిమ్ము • బోఁటివారి

కమిత సత్కీర్తికాముల • కలుషమతుల
కియ్యరాని పదార్థంబు • లెవ్వి గలవు. 361

ఆ. అడుగరానిసొమ్ము • నడుగ రాదని మూసఁ
డడుగువాని మాట • లడుగనేల
భ్రాంతి నడుగఁజోటఁ • బ్రాణంబు లేనియు
నిచ్చువాఁడు దాఁప • డిమ్ముగాని 363

వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు గార్యపరత సవి
నయ వాక్యపరంపరలఁ బ్రార్థించిన నతండు దరహాసితభా
సితవదనుండై యఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింత
కాలంబు ప్రతివాక్యం బిచ్చితి, దీని సహింపం దగుదురు
మీ యట్టి వారలకుం బ్రియం బగునేని నెప్పుడైన విడువం
దగినశరీరంబు విడుచుట యేమిదుర్లభం, బధ్రువంబైన
యీశరీరంబుచేతం గీర్తి సుకృతంబుల నెవ్వం డార్జింప
కుండు నతండు పాషాణాదులకంటె నతికష్టుండు. మీ యా
ట్టిపుణ్యశ్లోకులచేత నాశింపంబడిన యీశరీరం బప్ర
మేయధర్మార్జితం బీదేహంబుచేతనేనియు సకల
భూతంబులు శోకానుభవంబున శోకించు, హర్షానుభవం
బుల హర్షించు. నట్టి మహాకష్టదైన్యాకరంబైన యీశరీరం
బుకాక శునకసృగాలాదులపాలు గాకుండ మేలయ్యెనని
నిశ్చితాత్ముండయి దధీచిత్త్వాలోకనంబుచిత నిరసితబంధనుం
డయి బుద్ధీంద్రియమానసంబులతోఁ గూడిన క్షేత్రజ్ఞుని
బరబ్రహ్మస్వరూపం బైన భగవంతునందు నేకీభూతంబు
జేసి యోగజ్ఞానంబున శరీరంబు విడిచె. నప్పుడింద్రుం డతని

శల్యంబుల విశ్వకర్మనిర్మితంబయి నిశితశతధారాసమావృతంబయి వెలుంగు వజ్రాయుధంబు గైకొని భగవత్తేజోపబృంహితుం డయి యైరావతారూఢుం డై సకలదేవోత్తమగరుడగంధర్వఖచరకిన్నరకింపురుషసిద్ధవిద్యాధర పరిసేవితుండును సకలమునిజనంబులు వినుతింపఁ ద్రిలోకహర్షకారి యై భవదనుగ్రహసంప్రాప్తమహోత్సవ వికసితవదనారవిందుండై వృత్రాసురుపై నడచె నప్పుడు. 363

ఉ. వృత్రుఁడు మానవాన్వయప • విత్రుఁడు లోకజిఘాంసకక్రియాసూత్రుఁడు నిగ్రహాగ్రహణ • సుస్థిర వాక్యవివేకమానచారిత్రుఁడు దేవతోరగద • రీకృతవక్త్రుఁడు రోషదూషితామిత్రుఁడు శత్రురాకఁ గని • మిక్కిలి యైనయుగాంతకాకృతిన్.

క. మొండు గల దనుజనాయక
మండలములు గొల్వనడచె • మహిమోద్ధతి వే
దండములనడుమఁ జను నడ
గొండయునుం బోలె నిబిడ • కోపోద్ధతుఁడై. 365

క. కాలగళుఁ డడరి కదుపడిఁ
గాలునిపైఁ గవియుమాడ్కి • ఖరతరరవసం
చాలితపూర్వదిగంతరుఁ
డై లీల మహేంద్రుమీఁద • నతఁ డరిగె నృపా. 366

వ. ఇట్లు రుద్రగణంబులు వసుగణంబు లాదిత్యగణంబులు వశ్వదేవతలు బితృదేవతలు మరుద్గణంబులు విశ్వేదేవులు ఋభువులు వహ్ని యమ నైరృతి వరుణ వాయు కుబే రేశానాదులు సిద్ధసాధ్యకిన్నరకింపురుషగరుడగంధర్వ ఖేచరప్రము

ఖంబు లగు నింద్రసైన్యంబులతోడ నముచియు నంబరుండు ను ననర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును హయగ్రీవుండును శంకుశిరుండును విప్రచిత్తియు నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియు బ్రహేతియు నుత్కలుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును గపిలుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దందశూకుండును వృషధ్వజుండును గాలనాభుండును మహానాభుండును భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు మున్నగు దైతేయ దానవ యక్ష రాక్షసాద్యసంఖ్యాము లగు పృథ్వాసురుబలంబు లంతంతం దలపడి మహాయుగ చతుష్టయంబున ద్రేతారంభంబున సమరంబు సేసి రప్పుడు. 367

చ. అసురులకున్ సురావలికి నన్యోన్యమహారణమప్పుడొండొరుల్
ముసలగదాసికుంతశర • ముద్గరతోమరభిండివాలప
ట్టిస పటుశూలచక్రముల • శేవలుసూపియదల్చియార్చుచున్
మసలక కప్పి రస్త్రముల • మాన్కనిమంటలుమింటనంటగన్

క. ఒండొరులం గడవ నేసిన
కాండము లాకాశపథము • గప్పి మహోల్కా
తండంబు లొలసి నిష్ఠుర
భండనముఖ మొప్పె జూడం • బ్రళయోచిత మై 369

చ. సురవరు లేయు బాణములు • సూక్ష్మకగోచరమై నభస్థలం
బజిముఖిం గప్పి శేషి దివ • సాంతముం జేసిన లీలన్సూసు

శ్వరబలయూథవీరులును • సాయకపంక్తులచేత వాని రూ
పఱ శతధూళిఁ జేసి పఱ • పైనతమం బొనరించి యార్చుచుఁ.

చ. సమరమదాంధులై సురనిశాచరవీరులు సైనికాగ్రసం
క్రమితమహాపరాగములు • గ్రమ్మనుమ్ములికంపుఁ జీఁకటుల్
దమకనుదోయి కడ్డముగ • దార్కొనినం జలమేఁది పోరి రా
క్రమితనిజాంతరంగపరి • ఘట్టితరోషమహాగ్ని పెంపునన్.

క. అతిగళితరక్తధారా
క్షతములతోఁ గానఁబడిరి • సైనికులు మహో
ద్ధతరోషవహ్నికీలలు
వితతం బై పిక్కటిల్లి • వెడలెడుభంగిన్. 372

సీ. రవళించు శింజినీ • టంకారరవములు
ఘటసింహనాదంబుఁ • బరిఢవింప
భీషణోత్తమహాయ • హేషావిఘోషంబు
కరిబృంహిత స్ఫూర్తి • గ్రందుకొలుప
సమర నిశ్శంకాంక • శంఖనినాదంబు
నేమి స్వనంబుల • నివ్వళింపఁ
దుములమై చెలఁగెడు • దుందుభిధ్వానంబు
లట్టహాసంబుల • నాక్రమింప

తే. ఘటితశస్త్రాస్త్రనిష్ఠుర • ఘట్టనోత్థ
ఖరకఠోరోరువిస్ఫులిం • గంబు లడరి
దివ్యకోటీరమణిఘృణి • ధిక్కరింప
సమర మొనరించి రసురులు • నమరవరులు. 373

వ. ఇట్లు ప్రళయసంరంభవిజృంభిత సముత్తుంగరంగ త్తరంగి
తభైరవారావనిష్ఠూరమహార్ణవంబులుం బోలె యుగాంత
సంక్రాంతిఝుంఝూపవన పరికంపిత దీర్ఘ నిర్ఘాత నిబిడ ని
ష్ఠురనీరదంబులుం బోలె నుభయసైన్యంబులుం గలసి సం
కులసమరంబు సలుపుసమయంబున యుగాంతకృతాంతస
కలప్రాణిసంహార కారణలీలయుం బోలెఁ బదాతిరాహుత్త
గజారోహక రథిక మహారథికవీరు లొండొరులు చండ
గతిం గాండంబులు పఱపుచు గదలం జదుపుచుఁ గత్తుల
గత్తళంబులఁ జనుఁగం బొడుచుచు నసిదంబులఁ బొడుచుచు
గుంతంబులం గ్రుచ్చుచు గుఠారంబుల వ్రచ్చుచు ముసలం
బుల మోఁదుచు ముద్గరంబులం బొఁదుచుఁ జక్రంబులం
ద్రుంచుచు సబళంబుల నొంచుచు సురియల మెఱుముచు
శూలంబులఁ దుఱుముచు వాజుల కుఱికియు వాలంబుల
నఱికియు దోడలు తుడిచియుఁ దొండంబులుఁ ఖండించియు
నేడ లెడయించియు మెడళ్ళు గెడయించియు నడుములు
ద్రుంచియు నాసికలు ద్రెంచియుఁ బదంబుల విఱిచియు
బార్శ్వంబులం జఱిచియు గజరంబులఁ బఱిపియు గాత్రంబు
ల నుఱిపియు గంభంబులఁ బగిలించియుఁ గొమ్ములఁ బెక
లించియు హస్తంబులఁ దుంశించియు నంగంబుల జించియు
రణంబుల నలియించియు రథికులం బొలించియు సారథులం
జంపియు సైంధవంబులఁ జంపియు శిరంబు నొగలించియు
సీసకంబు లగిలించియు ఛత్రంబుల నుఱుమాడియుఁ జామ
రంబులం దునుమాడియు సైన్యంబులఁ జదిసియు సాహ

సులమిడిపియు సడుములు ద్రుంచియు మఱియును బరస్పర గుణవిచ్ఛేదనంబును నన్యోన్య కోదండఖండనపటుత్వంబును నుభయసైంధవధ్వజసారథిరథిక రథనికలనంబును నొండొరులపాదజానుజంఘాహస్తమస్తకనిర్దళనంబును రక్తమాంసమేదః పంకసంకలితసమరాంగణంబును నై యతిఘోర భంగిఁ బెసంగి రప్పుడు. 374

చ. సమజయమున్ సమానజయ • సామ్యపరిశ్రమమున్ సమానవిక్రమము సమాస్త్రశస్త్రబల • గర్వము నై కడు ఘోరభంగి నానముచిహరాగ్రసైన్యగణ • నాథులతోడ నిశాచరేశ్వరోత్తములు రణంబు సేసిరి రోఁగి • దారొక నివృత్తు బలంబు ప్రాపునన్.

వ. అప్పుడు. 376

లయగ్రాహి.

మొత్తముగఁ బాఱు వెను • నెత్తురుమహానదులఁ
దత్తఱముతో నుఱికి • కుత్తుకలు మోవం
జిత్తముల నుబ్బి వెస • నెత్తుకొను భూతముల
నత్తుకొని శాకినులు • జొత్తిలెడి మాంసం
బుత్తలముతో మెసఁగి • నృత్తములు సేయు మద
మత్తఘనడాకినులు • నృత్తిగతిఁ బ్రేవుల్
బిత్తరములం దిగిచి • మెత్తమెదడు ల్మానసి
గుత్తగొనుచుండ భయ • వృత్తిఁ గలనొప్పెన్.

వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి త్రేతాయుగంబు సొచ్చు నంతకాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయు చుండ నంత వృత్రాసుర భుజ

బలంబు పెంపునఁ దెంపు చేసి కంపింపక నిలింపులపై రక్కసు
లగుంపులు సొంపు పెంపు చూపి మహావృక్ష పాషాణగిరి
శిఖరంబులు వర్షించిన. 379

మ. గిరిపాషాణమహీజముల్ గురియఁగా గీర్వాణు లన్నింటి ని
ష్ఠురవారాచపరంపరల్ వఱపుచుం జూర్ణంబుగావింప ని
ర్భరలీలం దమ జేయు సత్త్వములు దోర్భంగంబులై పోవఁగాఁ
దెరలన్ రాక్షసయోధవీరులు మహోద్రేకంబు సంభిన్నమై.

క. ప్రచురముగ రాక్షసావళి
ఖచరులపై నేయు నిబిడ కాండావళి దు
ర్వచనుఁ డెడనాడు మాటలు
సుచరిత్రునియందుఁ బోలెఁ జొగి వయ్యె నృపా. 380

వ. అప్పుడు. 381

వలమయూరము.

అంత సురలేయు నిబిడాస్త్రములపాలై
పంతములు దక్కి హత పౌరుషములన్ ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుసిగి భూమిన్
గంతుకొని పాఱి రహ గాఁపరులార్వన్. 382

క. కొండలఁ బోలెడు రక్కసు
లొండొరుల గడవఁ బాఱి రుక్కఱి పటుకో
దండముఖసాధనంబులు
భండనమున వైచి దివిజపతు లార్వంగన్. 383

వ. ఇట్లు సమరతలంబు వాసి తనప్రాపు దూసి తీసి పఱచు

చుండు దండనాయకులం జూచి యసురేంద్రుఁ డతిం బకపక
నగి వృత్రాసురుం డిట్లనియె. 384

ఉ. తుచ్ఛతరవృత్తి మీకగునె • శూరుల కిమ్మెయి నేగి భోగముల్
గొల్లగఁ జేయు చావునుదిఁ • గోనవారల కేఁగఁగల్గ నీ
తెల్లిడ మంది యీసమరధర్మము మానిత లంగ బాసియే
మల్లుకు దుర్గమక్రమఘన • మత్తుఁ డనున్మృతు ప్రాపెరుంగరే.

క. చావున్ధ్రువ మైన ప్రాణికి
నావులు రెం డరిసికొనుఁడు • సమరమునందున్
భావింప యోగమందున
జావంగా లేని చెడుగు • చావరె జావే 386

వ. అని వాసుదేవ తేజోవిశేష విశేషితుండై దవానలకీలలం
బోలె వెలుంగుచు నెఱచి వెన్నిచ్చి పఱచు నసురుల
వెనుకొని తఱుము సురవీరులం జూచి హుంకరించి స్వర్గా
నుభవంబున నిచ్చలే కుండెనేని మదవలోకనస్పర్శనమా
త్రంబు ముందర నిలుతురు గాక యని యేచి కల్పాంతాన
ల్పఘనఘనాటోపంబునుం బోలె ఘోర కంఠహుంకారభ
ర్జనంబులం గర్జిలుచు ప్రళయకాలపవనప్రేరిభాసితమహాశి
ఖిశిఖావళులఁ దృణీకరించు కుటిలావలోకనంబుల నాలో
కించుచుం గాలపరిపక్వలీలాలోలుం డయిన శూలిపాలిక
నాభీల మూర్తియై సకల జీవభార భరణ దుర్భర భగ్న
బ్రహ్మాండభాండమహాధ్వానంబుగా నాస్ఫోటించిన. 387

ఉ. కూడెఁ జగంబులన్నియును గ్రుంకిరి సూర్యసుధాంశులద్రు
లూటాడెఁ నభస్థలం బగిలె • నంబుధు లింకెనుసు గ్రహాళివ

ట్రాడె వడిఁ దిశల్ వగిలె • సర్వర భ్రంగ నజాండభాండము
ల్లాడె విభాత బెగ్గడిలె • నార్చుచు వృత్రుఁడు బొబ్బవెట్టఁగన్.

లయగ్రాహి.

కూలిరి వియచ్చరులు • సోలిరి దిశాధిపులు
వ్రాలి రమరవ్రజము • తూలి రురగేంద్రుల్
ప్రేలిరి మరుత్తులెద • జాలి గొని రాశ్వినులు
డాలుడిగి రుద్రులవలీలఁబడిరార్కుల్
వ్రేలిరి దిగీశ్వరులు • కీలెడలినట్లు సుర
జాలములు పిన్నదుర • పాలగుచు ఘోరా
భీలగతిఁ ద్రోడఁ దను • కేలిధనువుల్ విడిచి
నేలఁబడి మూర్ఛలను • దేలిరి సుహోత్రుల్.

వ. ఇట్లు ఘోరకంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబులెఱుంగక రణరంగంబునం బడి బిట్టుమూర్ఛిల్లిన దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగదుర్దముండయి మహీవలయంబు పదాహతులఁ గజగజవడంక నిశితశూలంబు గేల నంకించుచు మదించిన భద్రమాతంగంబు కమలవనంబు చొచ్చి మట్టి మల్లాడు విధంబున నిమీలితాక్షులుగాఁ దనపదతలంబుల రూపంబులు మాయం జమురుచు వైక్లబ్యంబుగఁ గ్రీడించువానిం గని వజ్రి వజ్రశత్రోషమనిష్ఠురగదాదండం బాభీలభంగిఁ బ్రళయకాలమార్తాండచండ పరివేష ఘోరంబుగాఁ ద్రిప్పి వైచిన. 390

మ. అది మింటం బెనుమంటలం దుటబరుపై • యాభీలవేగంబునం

గడియన్ వహ్నినలీల నామకరసం • క్రాంతంబు గావించి బె
ట్టిదుఁడై చేరి సురారిదానిఁ గొనికా • తన్నోరుపాతంబులం
జదియన్ మోఁదె గజేంద్రమస్తకము ను • త్సాహైక సా
(హయ్యుఁడై. 391

ఆ. అగ్గజంబు గులిశ • హతిఁ గూలు కులమహీ
ధ్రంబుఁ బోలె రక్తధార లురుల
మస్తకంబు వగిలి • మద మఱి జిఱజిఱఁ
దిరిగి భీతితోడఁ • దెరలి పఱచె 392

ఉత్సాహము

గజము దెరలి దాని గొఱలి • కంప మొంది పాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ • బట్టి బిట్టు నిల్పుచున్
నిజసుధారసైక పాన • నిర్ణయార్ద్రకరమునన్
బుజుత మీఱ నిమిరె నదియు • రీతి మెఱసి క్రమ్మఱన్. 393

వ. ఇవ్విధంబున నైరావతంబును సేద దేర్చుచు నెదుర నిలు
చున్న భీమరపాణిం గనిఁ తోఁగ బుట్టువుఁ జంపిన తెంపుఁ
దలంచి మోహశోకంబుల విపర్యాసంబుగా నవ్వుచు నా
హవ కార్యార్థియై వృత్రుం డిట్లనియె. 394

శా. నాకుం బెద్దనసిరు సద్గురువు దీ • నవాతరక్షున్ శుభా
లోకుం జంపితివిట్లు పాపమతివై • లోభంబుతో నియ్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ • లోనైతివీశూలమం
దాకంపింపఁగనిన్నుఁ గ్రుచ్చిబుణము • క్తాత్ముండనై పేర్చెదన్

క. ఎట్టి తులు వైనఁ గాని
నెట్టన తనబ్రహ్మకు కోఱకు • నివలె గురువుం

జ్ఞమునఁ బుణ్య బ్రాహ్మణుఁ
బట్టి వధింపంగఁ గలడె • పశువుం బోలెన్. 396

చ. దయయును సత్యమున్ విడిచి • ధర్మము మాని యశంబుఁ బాసి శ్రీ
జయములఁ బాఱఁ దోలి పురు • షత్వము గాన సలోకనిందితా
హ్వయుఁ డగు వాపచావునకు • నార్యులు గుందుదురే సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ • బ్రేలక చేరునె కంకగృధ్రముల్

క. నిక్క మగు పాపములచేఁ
జిక్కితివి నిశాతశూల • శిఖరాగ్రమునన్
ద్రొక్కించి నీదు మాంసము
గుక్కలు నక్కలును బెఱికి • కొని తినఁ జేతున్. 398

ఉ. దీకొని నీకు నేఁ జెఱచ • దిక్కులఁ బ్రవ్విన వారు గల్గిరే
నేకమతిం బిశాచముల • కెల్లను దృప్తిగ మన్నిశాతశూ
లైతమహాగ్నికీలల న • నేకవిధంబుల సోమయాజి నై
మేఁకలఁ జేసి వ్రేల్చెదన • మేరుమదోద్ధతిఁ బ్రాలియుఃయ్యనిన్.

క. కాక నను గులిశధారల
దీకొని నిర్జింపఁ గలిగి • తేఁయు భూతో
ద్రేకంబు సేసి శూరుల
ప్రాకటపదపద్మధూళి • భాగం బగుదున్. 400

వ. అని మఱియు వాసుదేవకృపాలబ్ధదుర్నిరీక్ష్యుం డైన వజ్ర
హస్తునిం గని యిట్లనియె. 401

సీ. సందియం బేటికి • జంభారి వేవేగ
భిదురంబు వ్రేయుము యాగ • శీలభంగి
నతిలోభి నశీన • యర్థరాశియుఁ బోలె
గడపకు మిదివృథ • గాదు సుమ్ము
మురమర్దనుని తేజ • మున నాదధీచి వి
ద్యాతిశయంబున • నధిక మగున
యది గాన హరిచే ని • యంత్రితోన్నతుఁడనై
గెలువుము శత్రుని • గీటడంచి

ఆ. యెందుఁ గలఁడు విష్ణుఁ • డందు జయశ్రీలు
బొందుగాఁగ వచ్చి • పొందుచుండు
గాన భక్తవరదుఁ • గమలాక్షు సర్వేశు
పదములందు మనముఁ • బదిలపఱుతు. 402

వ. ఇప్పుడు వజ్రధారలం ద్రోపంబడిన విషయభోగంబులు గలవాఁడ నయి శరీరంబు విడిచి భగవద్ధామంబు నొందెద. నారాయణుని దాసుండ నైన నాకు స్వర్గమర్త్య పాతాళంబులం గల సంపద్భోగంబులు నచ్చింపం బడవు. త్రైవర్గిక కాయాస రహితం బయిన మహైశ్వర్యంబు ప్రసాదింపు, గావున ననుపమేయం బయిన భగవత్ప్రసాదం బన్యుల కగోచరం, బద్దేవుని పాదైక మూలంబుగా నుండు దాసులకు దాసాను దాసుండ నగుచున్న వాఁడ నని యప్పరమేశ్వరు నుద్దేశించి. 403

చ. అరయఁగ భక్తపాలనము • లైనభగవద్గుణజాలమాత్మ సం
స్మరణముసేయవాక్కునను • సన్నుతిసేయ శరీరవల్లిఁ గిం

కరపరివృత్తి సేయ మదిఁ • గాంక్ష యొనర్చెదఁ గాని యొల్లనే
నరిది ధ్రువోన్నతస్థలము • నబ్జజుపట్టణ మింద్రభోగమున్. 404

ఉ. ఆఁకలి గొన్న లేఁగలు ర • యంబున నీఁకలు రానిపక్షులుం
దీకొని తల్లికిన్ మఱి వి • దేశగతుండగు భర్త కంగజ
వ్యాకులచిత్తమైన జవ • రాలును దత్తఱ మందు భంగి నో
శ్రీకర పంకజాక్ష నినుఁ • జేరఁగ నామది గోరెడుం గదే.

క. నాకును సఖ్యము పుణ్య
శ్లోకులతోఁ గాని తత్త్వ • శూన్యులు సంసా
రైకవిమోహులతోడం
గా కుండ నొనర్పు మయ్య • కంజదళాక్షా. 406

వ. అని పలుకుచు. 407

మహాస్రగ్ధర.

హరిపై సర్వాత్ముపై న • త్యగణితగుణుపై • నంతరంగంబు పర్వన్
సరిమేనుప్పొంగ జావున్ • జయమును సరిగా • సంతసం బందుచున్
భీకరుండై కాలాగ్నివోలెం • గనలుచుఁ గవిసెన్ • గర్వదుర్వారు
డై దుర్భరలీలన్ భూమిగంపింపఁగ దిశ లద్రువన్ • భండనో
ద్దండవృత్తిన్. 408

క. దారఁకొని ప్రళయోదకమున
హరిపైఁ గైటభుఁడు గవియు • హంకారమునన్
సురనాథుమీఁద వృత్రా
సురుఁడు మహోద్వృత్తి నడచె • శూలాయుధుఁడై.

శా. కల్పాంతాగ్నియుఁ బోలె నుల్కలెగయుం • గాఁ ద్రిప్పుచున్
దీన నో । యల్పా చచ్చితి వంచు శూలము రయం • బొప్పం

గఁ బైవైచినం బోల్పం గోటిరవిప్రకాశత దీపింపం బోవంగ వీక్షిం
చి యుఁ వేల్పుల్ వొంగఁగ వజ్రధారఁ దునిమెన్ • విన్నాణ
మొప్పారఁగన్. 410

ఆ. శూల మప్పుడతఁడు • స్రుక్కక ఖండించి
పూనితోన కదిసి • భుజము ద్రుంచె
నసుర గనలి యేక • హస్తుఁడై పరిఘంబు
గొని మహేంద్రుఁ గిట్టి • హనువు లడిచె. 411

వ. ఇట్లు ప్రళయకాలభీషణపరివేష వేష్టంబుగా రోషంబునం బరిఘంబుఁ ద్రిప్పి కుప్పించి గజకుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రు హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొంచిన. 412

క. గజము మద ముడిగి తిరుగుచు
గుజగుజనై గీఁక వెట్టఁ • గులిశము నేలన్
భజన చెడి విడిచె నింద్రుఁడు
గజిబిజితో బెగడె నసుర • కడిమి జగంబుల్. 413

క. గరుడుఁడు పొదివిననాగము
కరణిన్ వృత్రాసురేంద్రు • కడిమికి లోనై
తిరుగుడు పడ్డహరిం గని
పురపుర నాహో యటంచుఁ • బొగిలిరి దివిజుల్. 414

వ. అప్పుడు. 415

ఆ. గజముపాటు చూచి • కడుదీనగతిఁ జూచి
పవికరంబు జాఱుట • పడుటఁ జూచి
యుద్ధధర్మ మెఱిఁగి • యున్నశత్రునిఁ జూచి
సిగ్గుతోడ వజ్రి • శిరము వాంచె. 416

వ. ఇట్లు యుద్ధరంగంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడిన వజ్రంబుఁ బుచ్చుకొనక సిగ్గుపడి లజ్జించి యున్న పాకశాసనుం జూచి వృత్రుం డిట్లనియె. 417

క. దురమునఁ గైదువు వదలిన
శరణన్నను వైరిజనులఁ ♦ జంపరు శూరుల్
వెఱఁగందనేల కులిశము
కర మరుదుగఁ బుచ్చికొనుము • కాచితి నింద్రా. 418

సీ. వజ్రంబుఁ గైకొని • వైరి నిర్జింపు మి
ట్లడలంగ వేళగా • దమరనాథ
యమర దేహాధీను ♦ లైన మూర్తుల కెల్ల
నీశు లక్ష్మీశు స • ర్వేశుఁ బాసి
కడతేర జయములు • గల్గునె యెందైనఁ
దలపోసి చూడుమా ♦ తత్త్వబుద్ధి
లోకపాలసమేత ♦ లోకంబు లెవ్వని
వశగతివలఁబడ్డ • పక్షులవలెఁ

తే. జక్కిచేష్టలు వోయుచుఁ ♦ జింత గాంతు
రట్టి మృత్యుబలంబుల • నాత్మజయము
తమదిగాఁ గోరి యజ్ఞాన • తంత్రులగుచుఁ
గమలలోచనలీలావి • కారములను. 419

తే. మఱియు యంత్రమయం బైన ♦ మృగముభంగి
దారునిర్మిత మైనట్టి • తరుణిపోలిక
శక్ర యెఱుఁగుమి యిల భూత • జాల మెల్ల
ధవళ పంకేరుహాక్షతం, త్రములు గాఁగ. 420

వ. మఱియు * భూతంబులచేతను నింద్రియంబులచేతను నవసుండైన పురుషుండు ప్రకృతిచేత వేఱు సేయంబడిన యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖయించుచుండు, నవిద్వాంసుండైనవాఁ డనవరతంబుఁ దన్ను స్వతంత్రుంగాఁదలంచుచుండు భూతంబులవలన భూతంబులుపుట్టుచుండు, నాభూతంబులు భూతంబులచేత భక్షింపంబడుచుండుఁ. బురుషున కాయువు శ్రీయును గీర్తియు నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతకాలంబు ప్రాప్తం బంతకాలంబు సిద్ధించు, నాప్రాప్తంబు దీఱినపురుషుండు జాలింబొందిన నవియుండక పోవుచుండుం. గావునగుణంబును నవగుణంబునుఁ గీర్త్యపకీర్తులును జయాపజయంబులును సుఖదుఃఖంబులును జావుబ్రతుకులును సమంబు లయి కలుగుచుండు, నజ్ఞాని యైనవానికి సత్త్వరజస్తమోగుణంబులు గలిగి యుండు. నట్టివానికి గుణమయంబులయిన యింద్రియాదులె యాత్మయని తోఁచుచుండుం గావున వాఁడా గుణంబులచేత బద్ధుండగు, నాగుణంబులకు సాక్షిమాత్రరూపగు శరీరంబు వేఱని యెవ్వఁడెఱుంగ నోపువాఁ డాగుణంబులచేత బద్ధుండు గాఁడు. గావున గుణంబులును గుణియును భోక్తయును భోగ్యంబును జయంబును నపజయంబును హర్తయునుహార్యంబును నుత్పత్తిస్థితిలయకర్తయై. సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండ కాని యన్యంబు లేదు. దివ్యాష్టహస్తంబు నాయుధంబునుం

బోయినను భవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండ నగు
నన్నుం జూడుము; వృత్రాసురుండు మఱియు నిట్లనియె.

తే. వాహనంబులు సారెలు • వాఁడిశరము
లూర్జితాక్షము లసువులె • యొడ్డనములు
గాఁగ బోరెడు నీద్యూత • కర్మమందు
నెసఁగు జయమును బరాజయ • మెవ్వఁడెఱుఁగు. 422

చ. అనవుడు వృత్రుమాటలకు • నద్భుత మందిసురేంద్రుఁ డెంత
యుం దనమదిఁ గుత్సితం బుడిగి • దైవముగా నతనిం దలంచి కై
కొనియెఁ గరంబునన్ దిగుచుఁ • గూలినవజ్రము నప్పుడాత్మలో
దనరె జగంబు లన్నియును • దంబును బొందిరి ఖేచరావళుల్.

క. రాహుగ్రహావక్త్రగుహా
గేహాంతము వాసి వచ్చి • కిరణావలి స
ద్బాహుళ్య మొప్ప వెలిఁగెడు
నాహరిదశ్వుండుఁ బోలె • హరి యొప్పె నృపా. 424

వ. ఇట్లు కరకలితవజ్రాయుధరుఙ్మండలమండితదిఙ్మండలుండయి
జంభారి గంభీర వాక్యంబులం విస్మయమందస్మితముఖార
విందుం డయి వృత్రున కిట్లనియె. 425

క. ఓదానవేంద్ర నీమతి
వేదాంతముఁ బోలెఁ దత్త్వ • విజ్ఞానకళా
మోదము నీ వతిభక్తుఁడ
వాదిమపురుషునకుఁ బతికి • నబ్జాక్షునకున్. 426

ఉ. లోకము లెల్ల నిండి తనలోనఁగ సర్వముఁ జేసి ప్రాణులన్
దీములఁ బెట్టి యొల్లెడలు • దీపులు సూపెడి విష్ణుమాయ నేఁ

డేకమతిం దలంచి తిది. యేల మహాసురరూపు మాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని శోభనమూర్తిధరింపుమింపునన్

ఉ. ఏనియు సంబు గల్గితివొ యెట్టి మహాతప మాచరించితో
పూని రజోగుణాభిరతిఁ బొందక నీమతి శాంతదాంత స
న్మానసమానసానుభవ సత్తమురాలుని లోకభావ స
న్మాన్యమనమేయ నాదనుజముఖ్య సుభక్తిపొసంగ నెంతయున్.

క. నారాయణ రూపామృత
పారావారమునఁ దేలు భక్తులకు గా భూ
దార కరఖాతకోదక
పూరంబుల నేల తృప్తిఁ బొందు మహాత్మా. 429

వ. అని పలుకు సురేంద్రు నుపలక్షించి వృత్రాసురుండు డా
యోధన దుర్మర్షణ సంఘర్షణ మాణ మానసుండై
వైరిం బురికొల్పుచు వామహస్తంబునం బరిఘంబు ద్రిప్పు
చు సాప్పరంబునకుం గుప్పించుచు బ్రహ్మాండకర్పరంబు
విష్ఫురత్భైరవారావంబునం బగిలించుచు సముత్తుంగమత్త
మాతంగపుంగవంబు వృషభంబుపైఁ గవియు
భంగి సురవృషభు పైఁ గురఁ బుపలక్షించి భీషణాశనిపాతవే
గంబునం గొట్టిన నింద్రుండు కులిశధార నప్పరికంబుఁ దు
నిమి తోడన శేషఫణావిశేషభాసురంబయిన బాహుదం
డంబు ఖండించె. నప్పుడు వృత్రుండు భిన్నబాహుద్వయ
మూలుండై రక్తధారావలిం దొరఁగుచు వజ్రిచేతం బక్ష
పాతంబై దివంబునం బడి జాఱుచున్న కులపర్వతంబునుం
బోలెం జూపట్టి ప్రళయకాలసంహారనిటలచ్ఛటచ్ఛటార్భట

కఠోరకీలాభీలాగ్ని సమానక్రూరకుటిల నిరీక్షణదుర్ని
రీక్ష్యుండును భూమిం గ్రిందిదాడను నాకాశంబు మీఁది
దాడను హత్తించి నభోమండలంబునుం బోలెఁ దుది మొద
లెఱుంగ రాక వికృతంబుగా వక్త్రంబు దెఱచి మందరమ
థన మధ్యమానవిషధరజనిత విషవిషమజిహ్వాభీలం బగు
నాలుక నభయంబు నాకుచుఁ గాలసంహారకారుణుం
డయిన కాలునిభుజాదండమండితం బగు కాలదండంబునుం
బోని దంష్ట్రలచేత జగత్త్రయంబును మ్రింగెడువాఁడునుం
బోలె నతిమాత్రమహాకాయుండయి పర్వతంబులం దలంగ
మీటుచు నడగొండయుం బోలె నభోభాగ భూభాగంబుల
నాక్రమించి యుప్పుడు. 430

ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగ
ముల్ గ్రాలఁగ దేవసంఘములు కంపము నొంద జగంబులెల్లనా
హాలుతితారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో
నాలుకఁ జుట్టిపట్టి సురనాథుని మ్రింగెమహాద్భుతాకృతిన్.

ఆ. లోక మెల్ల నడుపు చీకాకుపడెఁ దమం
బడరె నుడుగణంబు లవశఁ బడియె
సోనవాన గురిసె సూర్యచంద్రాగ్నుల
రశ్ము లడఁగె దిశలు రభసమయ్యె. 432

వ. అప్పుడు. 433

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపమునొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తరింపఁడు విశేషముఁ దప్పడు వైష్ణవీజయా

నందఘ్నవైరికవిద్యను మ • నంబునఁ దాల్చుచు నెంచెఁ గాని సం
క్రందునఁ డానిశాచరుని • గర్భములో హరిరక్షితాంగుఁడై

వ. ఇట్లు కవచరూప శ్రీనారాయణకృపాపాలితుండయి యోగబలంబునఁ బరభేది యతని యుదరంబు సవ్రజాయుధంబున భేదించి యైరావణసహితుండయి వెడలి యతని కంధరంబు తెగ నడువ వజ్రంబుఁ బ్రయోగించిన నది నిష్ఠురవేగంబున వృత్రహరణార్థంబుగం దిరుగుచు సూర్యాదిగ్రహనక్షత్రంబులకు దక్షిణోత్తరగతిరూపంబయిన సంవత్సరసంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రుశిరంబు పర్వతశిఖరంబునుం బోలెఁ ద్రుంచి కూలం ద్రోచె నప్పుడు. 435

మ. మొరసెన్ దుందుభులంబరంబునఁ గడున్ • మోదించి గంధర్వు
లున్ సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ • సొంపారఁ వృత్ర
ఘ్ను భీకరతేజోవిభవప్రకాశక రవి • ఖ్యాతైక మంత్రంబు
లం డిర మెప్పం బఠియించుచుం గురిసిరం • తేఁ గ్రొత్త
పూసోనలన్. 436

ఆ. ఏమి సెప్ప నప్పు • డింద్రారితనువున
నొకటి దివ్యతేజ • మబ్బి వెడలి
లోక మెల్లఁ జూడ • లోకులు సూడ నీ
లోక మరసి విష్ణు • లోను సొచ్చె. 437

వ. ఇట్లు లోకభీకరుండైన వృత్రాసురుండు గూలిన నఖిలలోకంబులుఁ బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె. దేవర్షి

పితృగణంబులు దానవులతోడం గూడి యింద్రునకుం
జెప్పక తమ యాస్థానంబులకుం జని రనిన విని పరీక్షిన్నరేం
ద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 438

ఆ. ఏమి కారణమున • నింద్రుతోఁ బలుకక
సురలు వోయి రట్టి • సురగణంబు
లెందుచేత సుఖము • జెందిరి వజ్రికిఁ
జేటు గలుఁగుటెట్లు • జెప్పవయ్య. 439

వ. అనిన శుకుం డిట్లనియె. వృత్రపరాక్రమ చకితు లయిన
నిఖిల దేవతలును మహర్షిగణంబులును మున్ను వృత్రవ
ధార్థం బింద్రుని బ్రార్థించిన నతండు బ్రహ్మహత్యకుం
జాలక తొల్లి విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును
భూమియందును జలంబులందును ద్రుమంబులందును విభ
జించి పెట్టితి నిపు డీహత్య యేమిటం బాపుకొనువాఁడ
నాకు శక్యంబు గాదనిన మహర్షు లశ్వమేధయజ్ఞంబు సేయించి
యజ్ఞపురుషుండయిన శ్రీనారాయణదేవుని సంతుష్టునిం
జేసి యీహత్యం బాపం గలవారము. స్వభావంబున బ్రా
హ్మణ పితృగోమాతృ సజ్జనహంత లయినవార లీదేవునిం
గీర్తించి శుద్ధాత్ములగుదురు, తద్దేవుని నశ్వమేధమహాధ్వర
ముఖంబున నశ్రద్ధాన్వితుండవై సేవించిన నీవు ఖలుండైన
యిద్దురాత్ముని హింసించిన హత్య యేమిసేయం గల దని
యొడంబఱిచిన, నింద్రుండు వల్లె యని యవ్విధంబున
వృత్రునిం బరిమార్చి బ్రహ్మహత్యం బొంది యాపాపంబు
భరియింప నోపక దుర్దశం బొందె నప్పుడు. 440

సీ. పాపంపుఁ జండాల • రూపంబు గలదాని
ముదిమిచే నొడలెల్లఁ • గదలుదాని
క్షయకుష్ఠరోగ సం • చయకృతంబగుదాని
నురురక్తపూరంబు • దొరఁగుదాని
నెరసిన వెండ్రుకల్ • బెరసినతలదాని
నటఁ బోకు పోకుండు • మనెడుదాని
గదురుకంపులఁ బ్రేవు • లదరఁ జేసెడుదానిఁ
దా నెందు బాఱినఁ • దఱుముదాని
ఆ. నా గుణంబులెల్ల • భోగింప కేరీతి
నరుగ నెంతవాఁడ • వనెడుదాని
బిట్టు దిరిగి చూచి • భీతిల్లి సిగ్గుతో
దేవనాయకుండు • దొలి పఱచె. 441

వ. ఇట్లతివికృతత్వంబుతో బ్రహ్మహత్య వెనుదగుల నింద్రుండు నభోభాగ భూభాగదిగ్భాగంబు లెల్లం దిరిగి చొరం దెరువు లేక దీర్ఘనిర్ఘాతాటోపనిశ్వాసదూషితుండై యీశాన్యభాగంబునకుం బఱచి యద్దెస నమేయపుణ్యాగణ్యం బయిన మానససరస్సునం బ్రవేశించి యందొక్క కమలనాళంబు సొచ్చి యందుఁ దంతువులం గలసి రూపంబు లేక యలబ్ధభోగుండై బ్రహ్మహత్యా విమోచనంబుఁ జింతించికొనుచు సహస్రవర్షంబు లుండె. నా చండాలియు నది పరమేశ్వర దిగ్భాగం బగుటం జేసి యందుం జొర రాక కాచియుండె. నంత కాలంబునఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల

యోగబలంబులం బాలించుచుండి సంపదైశ్వర్యమదాం
ధుండై యింద్రపత్నిం గోరి యింద్రుండు వచ్చునందాఁక
నాకుం బత్నివి గమ్మనిన, నా శచీదేవి బృహస్పతి ప్రేరిత
యయి బ్రహ్మర్షి వాహ్యశిబిక నెక్కి వచ్చి నన్ను భోగింపు
మనిన, నతఁడట్లు చేసి కుంభసంభవ శాపహతుండయి
యజగరయోని యందుఁ బుట్టె. నంత నింద్రుండు బ్రహ్మ
ర్షిగణోపహూతుండయి త్రిదివంబునకు వచ్చె. నంత
కాలంబు నారాయణచరణారవింద ధ్యానపరుండయి చిం
తించుచుఁ దద్దిశాధినాయకుం డయిన శంకరుచేత రక్షి
తుండయి యుండుటం జేసి తద్దోషబలంబు దఱిఁగి సహ
స్రాక్షుం బీడింప లేదయ్యె. నప్పు డింద్రుండు నిజైశ్వ
ర్యంబునుం బొంది బ్రహ్మర్షి పరివృతుండయి మహాపురు
షారాధనంబు సేసి హయమేధాధ్వరంబునకు దీక్షగైకొని
బ్రహ్మవాదులచేతి యజింపఁబడుచున్నవాఁడయి
సర్వదేవతామయుం డయిన నారాయణుం బరితృప్తుం జేసి
మంచు విరియించు మార్తాండుని చదంబునఁ ద్వాష్ట్రవధ
రూపపాపంబు నాశంబు నొందించి సకల దివిజయక్ష గంధ
ర్వసిద్ధమునిజనసంస్తూయమానుం డయి త్రిభువనైశ్వర్య
భోగ భాగ్యంబులం గయికొనియె నప్పుడు. 442

చ. సతతమరీచి ముఖ్యముని • సంయమిచేత యథోచితంబుగాఁ
గృతఘనవాజిమేధమునఁ • గేశవుఁ బురాణపూరుషున్
హితు జగదీశు యజ్ఞపతి • నిష్టఫలప్రదు నంతరంగసం
గతు భజియించి వజ్రిగత • కల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా.

సీ. మఱియుఁ బుట్టింపంగ ♦ మనసు వెట్టిన యట్టి
క్రూరకర్మాంభోధి • కుంభజుండు
అంగారములు సేయు ♦ నాహుతిఁ గననోపు
బహుపాప కానన ♦ పావకుండు
కందక దిగ మ్రింగ • గట్టునఁ దేఁపంగఁ
గల్మష గరళగం • గాధరుండు
ఘనగుహాంతరముల • కాలూన సియ్యాని
కలుష దుస్తరతమో • గ్రహావిభుండు

ఆ. సకల ముక్తిలోక ♦ సామ్రాజ్యసమధిక
సహజభోగ భాగ్య • సంగ్రహైక
కారణాప్రమేయ ♦ కంజాక్ష సర్వేశ
కేశవాది నాను • కీర్తనంబు. 444

సీ. అఖిలదుఃఖైక సం • హార కారణమును
నఖిలార్థసంచ యా • హ్లాదకరము
విమలభక్త్యుద్రేక • విభవ సందర్శనం
బనుపమభక్త వ ♦ ర్ణనరతంబు
విబుధహర్షానేక • విజయ సంయుక్తంబు
గ్రస్తామరేంద్ర మో • క్ష క్రమంబు
బ్రహ్మహత్యానేక • పాపాబ్ధితారణ
కారణ సజ్జన ♦ కాంక్షితంబు

తే. నైన యీయితిహాసంబు ♦ నధికభక్తి
వినినఁ జదివిన వారికి • ననుదినంబు

నాయురారోగ్యకరము జ • యాభివృద్ధి
కర్మనాశము సుగతియుఁ • గల్గు చుండు. 445

సీ. నావుడు యోగీంద్ర • నామనం బీవృత్తు
వివరంబు నీచేత • విన్న మొదలు
కడు నద్భుతంబునఁ • గళవళం బందెడుఁ
గోఱలు రజస్తమో • గుణములందు
వర్తించు నీహీన • వర్తికి నేరీతి
మాధవ పదభక్తి • మది వసించె
సత్త్వస్వభావులై • సమబుద్ధులై తపో
నియమప్రయత్నులై • నిష్ఠచేత

తే. నిర్మలాత్మకు లైనట్టి • ధర్మపరుల
కమరుఁగుఁ బుణ్యమునులకు • నంబుజాక్షు
భూరికైవల్య సంప్రాప్తి • మూల మైన
భక్తి వీనికిఁ బోలె నే • ర్పాటు గాదు. 446

సీ. భూస్థలిఁ గల రేణు • వులకన్న దట్టమై
కడు నొప్పు జీవ సం • ఘములు గలవు
ఆజీవములలోన • నరయ ధర్మాయత
మతి వసించినవారు • మనుజజాతి
యా మనుష్యులలోనఁ • గామంబుఁ బెడఁబాసి
మోక్షార్థు లగువారు • మొదల నరిది
మోక్షమార్గం బాత్మ • మూలంబుగా నుండు
వారిలో ముక్తులు • లేరు తఱచు

తే. ముక్తులైనట్టివారిలో • యుక్తి దలపఁ
జాల దుర్లభుఁ డమితప్ర • శాంతిపరుఁడు
పరమసుజ్ఞాననిరతుండు • భద్రగుణుఁడు
రమణ శ్రీవాసుదేవప • రాయణుండు 447

తే. సకలలోకాపకారి దు • స్సంగతుండు
వృత్రుఁ డే క్రియ సుజ్ఞాన • వేదియయ్యె
సమరమునఁ బౌరుషంబుచే • నమరవిభుని
నెట్లు మెప్పించె దీని నా • కెఱుఁగఁ జెప్పుమ 448

—చిత్రకేతూపాఖ్యానము—

వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగె నని సూతుండు శౌనకాదిమునులకుం జెప్పి మఱియు నిట్లనియె. నట్లు గజపురవల్లభుండు సంప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణశ్రద్ధాపరుం డయి యిట్లనియెఁ. దొల్లి కృష్ణద్వైపాయన నారద దేవలమహర్షులు నాకెఱింగించిన యితిహాసంబు గలదు, దాని నెఱింగించెద సావధానుండవై యాకర్ణింపుము. 449

చ. అమితవిభూతిఁ జాల నమరాధిపుఁ బోలుచు శూరశేనదేశములకు భర్తయై ప్రజలు•సంతసమందఁగ సార్వభౌముఁడై
క్షమ దన కెల్లకాలమును•గామదుహంబుగఁ జిత్రకేతునామమునఁ బ్రసిద్ధికెక్కె గుణ•మండనుఁ డంచితకీర్తి గాముఁడై.

సీ. మానితతారుణ్య • మదనతురంగులు
కందర్పవిజయైక • ఖడ్గలతలు

మదనసమ్మోహన • మంత్రాధిదేవతల్
పంచశిలీముఖు • బండెకత్తె
లసమాస్త్రిఁ డఖిలంబు • నడగించు బొమ్మలు
నాత్మసంభవుని క • ట్టాయితములు
పుండ్రేక్షుకోదండు • భూరి తేజంబులు
శంబరవిద్వేషి • సాయకములు

తే. నాఁగఁ బొలుపారు నొకకోటి • నలినముఖులు
దనకుఁ బత్నులు గాగ న • త్యంతవిమల
కీర్తివైభవ సన్మార్గ • వర్తి యగుచు
జగతిఁ బాలింపుచుండె నా • జనపభుండు. 451

తే కడిమి వేవేలు భార్యలు • గలిగి యుండి
పరఁగ సంతతి యొందను • బడయ లేక
చిత్తమునఁ జాలఁ బాయని • చింత వొడమి
బడలఁ జొచ్చెను వేసవి • మడువుబోలె. 452

ఉ. రూపముసత్ప్రతాపముమ•రుత్పతిభోగముయౌవనంబుసం
దీపితచారువర్తనము•దిగ్విజయంబును సత్యముం జగ
ద్వ్యాపితకీర్తియుం సతులు•వైభవముఖ్యములెల్ల మాన్పఁగా
నోపక యుండె నాన్నృపతి• నొందినసంతతి లేనిదుఃఖమున్.

వ. ఇట్లు సంతతి లేక యతిదుఃఖమానసుం డయిన యానరేం
ద్రుని మందిరంబున కంగిరస మహాముని వచ్చి యతనిచేత
నతిథిసత్కారంబులు వడసి కుశలం బడిగి రాజ్యంబు భవద
ధీనంబకదా, పృథివ్యప్తేజోవాయ్వాకాశమహదహంకారంబు

లని యిట్టి యీశ్వరునిచేత రక్షింపంబడ్డ జీవుండునుం బోలె నమాత్య జనపదదుర్గద్రవిణసంచయదండమిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండవై ప్రకృతిపురుషుల యందు భారంబు వెట్టి రాజ్యసుఖంబు లనుభవింతువు గదా, మఱియు దారప్రజామాత్యభృత్యమంత్రి పౌరజానపదభూపాలురు నీకు వశవర్తులుగదా, సర్వంబునుం గలిగి సార్వభౌముండ వైన నీవదనంబున విన్నదనంబు గలిగి యున్నయది కతం బేమి యనిన నా మునిప్రవరునకు నతం డి ట్లనియె. మీ తపోబలంబున మీకు నెఱుంగరాక యున్న యదియుం గలదే యని తల వంచి యూరకున్న నతని యభిప్రాయం బెఱింగి యా భగవంతుం డైన యంగిరసుండు దయాళుండయి పుత్రకామేష్టి చేసి యజ్ఞశేషం బతని యగ్రమహిషి యైన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్త్రుండు గలిగెడి నతనివలన సుఖదుఃఖంబు లనుభవింపం గల వని చెప్పి యమ్మహాత్ముండు సనియె. నా కృతద్యుతి యను దేవి గర్భంబు ధరియించి నవమాసావసానంబునం గుమారునిం గనియె. నా కాలంబున రాజును సమస్తభృత్యామాత్యజనంబులు బరమానందంబు బొంది. రవ్వుడు చిత్రకేతుండు కృతస్నానుండయి సకలభూషణభూషితుం డయి సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి బ్రాహ్మణులకు నపరిమిత హిరణ్యరజతదానంబులు వస్త్రాభరణంబులును గ్రామంబులును గజంబులును వాహనంబులును ధేనువులును నాఱేసి యర్బుదంబుల ద్రవ్యంబును దానంబు చేసి ప్రాణిసముద

యంబునకుం బర్జన్యుండునుం బోలె దక్షిణవాలకు నిష్టకా మంబులు వర్షించి పరమానందహృదయుండయి యుండె కుమారుండును మాతృపితృ బంధుజనంబులకు సంతోషంబు చేయుచు దినదిన ప్రవర్ధమానుండయి పెరుగుచుండె. నంతం బుత్రమోహంబునం గృతద్యుతియందు బద్ధానురాగుండయి మహీధవుండు వర్తింపుచుండం దక్కినభార్యలసంతానసంతోషవికలలై యీమోహంబునకుం గారణంబు పుత్త్రుండ యని యీర్ష్యం జేసి దారుణచిత్తలయి కుమారునకు విషంబు బెట్టించిన సుఖనిద్రితుండునుం బోలె బాలుండు మృతిం బొందె. నప్పుడు నెగులయి దాది బోధింపం జని యాకుమారుని వికృతాకారంబుం జూచి విస్మయ శోకభయార్తయై పుడమిం బడి యాక్రందించె. నప్పుడు. 454

తరలము.

పుడమి నట్టక నిల్వనం బడి • పొక్కుచుం గడుదీనయై
యడఁకు నేమియు లేనివాక్కులు•నావురంచు విలాపమం
దెసను దోఁప భృశాతురోన్నతి • నేడ్చినన్ విని భీతితోఁ
గడుపు బిట్టవియంగ భూపతి • కాంత గ్రక్కున నేఁగుచున్.

ఆ. బాలుఁ జొక్కియుండు • పరిణామశీలుండు
వంశకర్త తపసి • వరమువలనఁ
బుట్టి మిన్న కల్లు • వ్రాలిసి యున్నట్టి యా
కొడుకుఁ జూచి తల్లి • యడలఁ జొచ్చె. 456

ఉ. కుంకుమరాగరమ్యకుచకుంభములం గడుఁ గజ్జలంబుతోఁ
బంకిలమైనబాష్పములు పాల్పడ మజ్జన మాచరించుచుం
గంకణపాణిపల్లవయు గంబున వక్షము మోదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁ బరిభావితపంచమసుస్వరంబునన్.

క. ఆయార్తరవమునకు భూ
నాయకుఁడు భయంబు నొంది నయము మిసిగి సుతుఁ
డాయఁగ వేగంబున జని
పాయనిమోహంబుతోడ బాలునిమీఁదన్. 453

స్రగ్విణి.

ప్రాలి యోపుత్రసీ వార్త దంభోధియై
కూలఁగా వ్రేయ కీ కొద్ది నన్నేఁటికిన్
జాలి నొందించె నా జాడ నుం కెట్టిదో
తూలుమీఁగల్లికిన్ దుఃఖ మెట్లారునో.

వ. అని తల మొల యెఱుంగక పలవించుచు భృత్యామాత్య బంధుజనంబులం గూడి యుడలుచు నున్న యారాజు దుఃఖం బెఱింగి యంగిరసుండు నారదునితోడం గూడి చనుదెంచి మృతుండయిన పుత్త్రునిపదతలంబున మృతుండునుం బోలెఁ బడియున్న యారాజుం గనుంగొని యిట్లనియె. 460

సీ. నీకు నీఁ డెవ్వఁడు నీ వెవ్వనికి శోక
సంతాప మందెదు సార్వభౌమ

పుత్త్రమిత్త్రాదులు • పూర్వజన్మంబున
నెవ్వరివారలో • యెఱుఁగఁ గలవె
మొదలవేసదీగ • మున కాడకు
సికతంబు గూడుచుఁ • జెదరు చుండు
నారీతిఁ బ్రాణుల • కతి కాలగతి చేత
బుట్టుట చచ్చుట • పొసఁగు చుండుఁ

ఆ. గాన భూతములకుఁ • గలుగు భూతంబులు
మమతతోడ విష్ణు • మాయఁ జేసి
దీని కడల నేల • ధృతిఁ దూలగా నేల
బుద్ధిఁ దలఁప వలదె • భూతసృష్టి. 461

వ. మఱియు నేను నీవును దక్కినవారలును బ్రవర్తమాన కాలంబునం గలిగిన జన్మంబు నొంది మృత్యువు వలన విరామంబు నొందం గలవార మై యిప్పుడ లేక పోవుదుము, చావు పుట్టువులకు నిక్కంబు లే. దీశ్వరుండు దన మాయచేత భూతజాలంబుల వలన భూతంబులం బుట్టించు, వాని నా భూతంబుల చేతన రక్షించు, వాని నా భూతంబుల చేతన హరించు. స్వతంత్రంబు లేసి తన సృష్టిచేత బాలుండునుం బోలె నపేక్ష లేక యుండు. దేహి యైన పితృదేహంబుచేత దేహి యైన పుత్రదేహంబు మాతృదేహంబు వలనం గలుగు చుండు. నా ప్రకారంబునబీజంబు వలన బీజంబు పుట్టు చుండ దేహికి నివి శాశ్వతం బై జరుగుచునుండుఁ. బూర్వ కాలంబున

సామాన్య విశేష విభాగంబులు సన్మాత్రం బైన వస్తువు
లం దేవిధంబునం గల్పింపం బడియె, నాప్రకారంబున
దేహంబునకు జీవునకు నన్యోన్యవిభాగంబు పూర్వకాలం
బున నజ్ఞానకల్పితం బయ్యె. జన్మఫలంబులను జూచుచున్న
వారికి దహనక్రియల నగ్ని పెక్కురూపంబులం గానంబ
డుభంగి నొక్కండయిన జీవుండు పెక్కుభంగుల వెలుంగు
చుండు, నివి యన్నియు నాత్మజ్ఞానంబు చాలక దేహి
దేహ సంయోగంబు స్వప్నంబునందు భయావహం
బైన ప్రయోజనంబు నడుపు చుండి మేల్కాంచి
యాస్వప్నార్థం బైన ప్రయోజనంబు తనదిగా దనియెఱుం
గుభంగి జీవుండే తా నని జ్ఞానగోచరుం డైనవాఁడెఱుం
గుం గావున నన్నియును మనోమాత్రం బని తెలిసి మో
హతమంబు వాసి భగవంతుం డైన వాసుదేవుని యందుఁ
జిత్తంబు వెట్టి నిర్మలాత్మకుండు వగు మని బోధించినఁ
జిత్రకేతుండు లేచి వారల కిట్లనియె. 462

సీ. యతివేషములు పూని • యతిగూఢగతి నిందు
 నే తెంచినట్టి మీ • రెవ్వరయ్య
కడఁగి నన్ బోలిన • గ్రామ్యబుద్ధుల నెల్ల
 • బోధింప వచ్చిన • పుణ్యమతులొ
సనకుఁ గుమారసనా • రద ఋషభాదులో
 దేవలాసితు లను• ధీరమతులొ
వ్యాస వసిష్ఠ దు • ర్వాస మృకండుజ
 గౌతము శుక రామ • కపిలమునులొ

తే. యాజ్ఞవల్క్యుండుఁ దరణియు • నారుణియును
జ్యవనరోమశు లాసురి • జాతుకర్ణ
దత్త మైత్రేయ వరభర • ద్వాజబోధ్య
పంచశిఖులుఁ బరాశర • ప్రభృతిమునులు. 463

క. ధీరులలో నెవ్వరు సుర
చారణగంధర్వసిద్ధ • సంఘంబులలో
నారలో యీసుజ్ఞానము
కారణ మై యెవరియందుఁ • గలదు తలంపన్. 464

క. పొందుగ గ్రామ్యపశుత్వము
నంది మహాశోకమందు • నడగిన నాకున్
ముందఱ దివ్యజ్ఞానముఁ
జెందించినవారొ మిమ్ముఁ • జెప్పుఁడు తెలియన్. 465

వ. అనిన నంగిరసుం డిట్లనియె. నేను బుత్త్రకాంక్షి నైననీకు బుత్త్రుం బ్రసాదించిన యంగిరసుండ, నితండు బ్రహ్మపుత్త్రుం డయిన నారదభగవంతుండు, దుస్తరం బైన పుత్త్రశోకంబున మగ్నుండ వైన నిను ననుగ్రహించి పరమజ్ఞానం బుపదేశింప వచ్చితిమి. నీదుఃఖం బెఱింగి పుత్త్రు నిచ్చితి మేనిఁ బుత్త్రసంతు లయిన వారితాపంబు నీచేత ననుభవింపంబడు. ఈప్రకారంబున లోకంబున సతులును గృహంబులును సంపదలును శబ్దాదు లయిన విషయంబులును రాజ్యవైభవంబును జంచలంబులు. మఱియు రాజ్యంబును భూమియును బలంబును ధనంబును భృత్యామాత్య

సుహృజ్జనంబులను మొదలయిన శోకమోహభయపీడలం
జేయుచుండుం గాని సుఖంబుల నీనేరవు. గంధర్వనగరం
బునుం బోలె స్వప్నలబ్ధ మనోరథంబునుం బోలె నర్థంబును
బాసి కానంబడుచు మనోభవంబు లయిన యర్థంబులం
గూడి స్వార్థంబు లయి కానంబడనేరవు. కర్మంబులచేత
ధ్యానంబులు సేయుచుండు, మనంబులు నానాకర్మంబు
లగుచు నుండు. నీదేహి దేహంబు ద్రవ్య జ్ఞానక్రియాత్మ
కంబై దేహికి వివిధక్లేశ సంతాపంబులం జేయుచుండుం.
గావున నీవు నిర్మలం బయిన మనంబుచేత నాత్మగతి వెదకి
సుస్థిరం బయిన పదవి నొందు మనియె. నప్పుడు నారదుం
డిట్లనియె. నుపనిషద్గోప్యం బగు నే నిచ్చు మంత్రం బెవ్వం
డేని సప్తరాత్రంబులు పఠియించు, నతండు సంకర్షణుం
డైన భగవంతునిం జూచు. నెవ్వని పాదమూలంబు సర్వా
శ్రయం బై యుండు. నట్టి శ్రీమన్నారాయణుని పాదంబు
లు సేవించి యీ మోహంబు వదలి యతిశీఘ్రంబున
నుత్తమ పదంబు నొందు. మిప్పు డిక్కుమారునకు నీకును
బ్రయోజనంబు గలదేసం జూపుము.

వ. అని నారదుండు మృతబాలకుని కళేబరంబుం జూచి యో
జీవుండ నీకు శుభం బయ్యెడు. నిందుం బ్రవేశించి యాయు
శ్శేషంబు ననుభవించి పితృాధీనంబైన రాజ్యాసనంబునం
గూర్చుండు మనిన నజ్జీవుం డిట్లనియె.

తే. కర్మవశమున నొందు సు • ఖంబు లేక
దేవతిర్యఙ్నృయోనులం • దిరుగు నాకు

వెలయ నేజన్మమందునో • వీకు తల్లి
దండ్రులయినారు చెప్పవే • తాపసేంద్ర.

తే. బాంధవజ్ఞాతి సుతులును • బగతు రాత్మ
వరులుదాసీన మధ్యస్థ • వర్గములును
సరగ వినుచుండు రొక్కొక్క • జన్మమునను
నెఱయఁ బ్రాణికి నొక్క వావి • నిజము గలదె.

తే. రత్నములు హేమములు సను • రాగలీల
నమ్మకంబుల నీవల • నావల నగు
భంగి నరులందు జీవుండు • ప్రాప్తుఁ డగుచు
నిలమిఁ దిరుగుచు నుండుఁ దా • నెందుఁ జెడఁడు.

సీ. ఒక్కఁడై నిత్యుఁడై • యొక్కడుఁ గడలేక
సొరిది జన్మాదుల • శూన్యుఁడగును
సర్వంబునం దుండి • సర్వంబు దనయందుఁ
నుండంగ సర్వాశ్ర • యుం డనంగ
సూక్ష్మమై స్థూలమై • సూక్ష్మాధికములకు
సామ్యమై స్వప్రకా • శమున వెలిఁగి
యఖిలంబుఁ జూచుచు • నఖిల ప్రభావుఁడై
యఖిలంబుఁ దనయంద • యడఁచికొనుచు

తే. నాత్మమాయాగుణంబుల • నాత్మమయము
గాఁగ విశ్వంబుఁ దనసృష్టి • ఘనతఁ జెందఁ
జేయుచుండును సర్వేశుం • జీవనుండు
రమణ విశ్వాత్ముఁ డయిన నా • రాయణుండు. 470

క. సతు లెవ్వరు సుతు లెవ్వరు
పతు లెవ్వరు మిత్త్రశత్త్రు బాంధవప్రియసం
గతు లెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షియైన పురుషుఁ డొక్కఁ డిలన్. 471

చిత్రకేతుండు తపం బాచరించి భగవత్ప్రసాదంబు నొందుట.

వ. మఱియు సుఖదుఃఖంబులం బొందక సర్వోదాసీనుండయి పరమాత్ముండై యుండు నప్పరమేశ్వరరూపుండ నయిన నాకును మీకును నెక్కడిసంబంధంబు. మీకు దుఃఖింపనవసరంబు లేదని పలికి యా శిశుప్రాణుండు పోయినం, జిత్రకేతుండును బంధువులును విస్మితచిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునానది యందు నశ్వరుం డగు నా కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించిరి. చిత్రకేతుండు గాఢపంకంబునం బడి వెడలిన యేనుంగునుం బోలె గృహాంధకూపంబునం దుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వకంబుగ గృతస్నానుండయి మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుండయి భగవన్మంత్రంబు విధిపూర్వకంబుగా నతనికి నుపదేశించి యంగిరసుతోడం గూడ బ్రహ్మలోకంబునకుం జనియె. చిత్రకేతుండును నారదోపదేశమార్గంబున నిరాహారుండయి సమాధినిష్ఠుండయి నారాయణరూపం బయిన యా విద్య నారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతం బయిన విద్యాధరాధిపత్యంబును భాస్వద్రత్న దివ్యవిమానంబునుం బడసి నారాయణానుగ్రహంబునం బొంది మనోగమనం బు

నం ద్రిజగరిబులం జరియించు చుండఁ గొన్నిదినంబులకు నొక్కచోట. 472

సీ. తారహారపటీర • ధవళ దేహమువాని
రమణీయ నీలాంబ • రంబువాని
మణికిరీటస్ఫుర • న్మస్తకంబులవానిఁ
గంకణకేయూర • కరమువానిఁ
గర్బురమయదీప్త • కటి సూత్రములవానిఁ
దరళయజ్ఞోప వీ • తములవాని
నతిసుప్రసన్న వ • క్త్రాంబుజంబులవానిఁ
దరుణవివృత్త నే • త్రములవాని

ఆ. సిద్ధమండలంబు • సేవింపఁ బుణ్యప్ర
సిద్ధి వెలసినట్టి • శుద్ధచరితుఁ
బద్మలోచనునకుఁ • బాదపీఠం బైన
ఘనునిఁ బన్నగేంద్రుఁ • గాంచె నతఁడు. 473

ఆ. కన్నమాత్ర నతఁడు • కల్మషంబులఁ బాసి
విమలచిత్తుఁ డగుచు • విశదభక్తి
నిట్టరోమములకుఁ • బట్టగు చానంద
బాష్పనేత్రుఁ డగుచుఁ • బ్రణుతి సేసె. 474

క. సంతోషాశ్రులచేత న
నంతుని బరిషిక్తుఁ జేసి • యతఁడు ప్రమోదం
బెంతయు నరికట్టిన నొక
కొంతయుఁ బలుకంగ లేక • కొండొకవడికిన్. 475

చ. మదినొకయింతమాత్రమున • మంచుగ జేయుచు బాహ్యవర్త
నం।గదిసిన యింద్రియంబులకొ • కంతకు దెచ్చి వచోవిలాసముక్త
గుమురుగ ద్రోచితత్త్వమున • గూర్చుచు శాశ్వతవిగ్రహంబునా
సదయు బ్రశాంతు లోకగురు • సన్నతి సేయ దొడంగె నిమ్ములన్.

క. అజితుఁడ వైన భక్తులచే
విజితుఁడ వైనాఁడ వీవు • వేడుక వారున్
విజితులు నీచే గోర్కెలు
భజియింపని వారు నిన్నుఁ • బఠయుమ రెహరీ. 476

ఉ. నీవిభవంబు లీజగము • నిండుట యుండుట నాశ మొందుటల్
నీవిమలాంశజాతములు • నెమ్మి జగంబు సృజించువారలో
దేవ భవద్గుణాంబుధుల • తీరము గానక యాశ బుద్ధితో
వావిరి జర్చ సేయుదురు • వారికి వారలు దొడ్డవారలై.

క. పరమాణువు మొదలుగ గాని
పరమము తుది గాఁగ మధ్య • పరికరనచే
స్థిరుడవు త్రయీవిభుఁడ వై
సరి సత్త్వాద్యంతమధ్య • సద్భావగతి వై. 476

తే. ఉర్వి మొదలైన యేడు నొం • డొకటికంటె
దశగుణాధిక మై యుండు • దాని నడుమ
కోశమందు రజాండంబు • కోటులెవ్వ
నందు నణుమాత్రమగు ననం • తాఖ్యుఁడతఁడు 477

వ. మఱియు నొక్కచోట విషయతృష్ణాపరు లైన నరపశువులు పరతత్త్వంబ వైన నిన్ను మాని యైశ్వర్యకాములయి తక్కిన దేవతల భజియింతురు. వారిచ్చుసంపదలు రాజ

కుంభంబునం బోలె వారలు గూడి నాశంబునం బొందు
చుందురు విషయకాములై నిన్ను సేవించి రేని వేచినవిత్తనం
బులం బోలె దేహాంతరోత్పత్తిం బొందకుందురు. నిర్గు
ణుండవయి జ్ఞానవిజ్ఞానరూపంబు నొందియున్న నిన్ను గుణస
మేతునిం గా జ్ఞానులు భావింపుదురు. నీ భజనంబే యపు
నరయిన మోక్షంబు ప్రసాదించు. జితమతి వగు నీవు
భాగవతధర్మం బే ప్రకారంబున నిర్ణయించితి, వా ప్రకా
రంబున సర్వోత్కృష్టుండ వగు నిన్ను సనత్కుమారా
దులు మోక్షంబుకొఱకు సేవించుచున్నారు. ఈ భాగవత
ధర్మంబునందు జ్ఞానహీనుం డొకండును లేఁ, డన్యకామ్య
ధర్మంబులందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నవి
వచించుచున్నవాఁడు ధర్మనిరతుం డయి క్షయించు
చుండు. స్థావర జంగమప్రాణి సమూహంబునందు సమం
బయిన భాగవత ధర్మంబుల వర్తించుచున్న మనుజునికి
భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమి చిత్రం
బిపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశేషమలుండ
నైతి. మూర్ఖుండ నయిన నాకుఁ బూర్వకాలంబున నార
దుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె, నది నేఁడు
నాకుఁ బరదుండ వైన నీకతంబున దృష్టం బయ్యె. ఖద్యో
తంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగ
దాత్మకుండ వైన నీ మహత్త్వంబు మనుజులచేత నాచరిం
పంబడి ప్రసిద్ధం బైనదిగా. దుత్పత్తిస్థితిలయకారణుండ వై
భగవంతుండ వయిన నీకు నమస్కరించెద ననిమఱియును.

తే. అరయ బ్రహ్మాదు లెవ్వాని ♦ ననునయించి
భక్తియుక్తుల భయమునఁ ♦ బ్రస్తుతింతు
రవని యెవ్వనితలమీఁద ♦ నావగింజ
పోలు నావేయుశిరముల ♦ భోగిఁ గొల్తు. 482

క. ఈ విధమున వినుతింపఁగ
నావిద్యాధరులభర్త ♦ కనియె ననంతుం
డో విమలబుద్ధి నీ దగు
ధీవిభవంబునకు మెచ్చి ♦ తిం బ్రియ మార్గన్. 483

ఆ. అరయ నారదుండు ♦ నంగిరసుండును
దత్త్వ మొసఁగినారు ♦ దానికతన
నన్నుఁ జూడఁ గల్గె ♦ నాభక్తి మది గల్గె
నాపథంబు నీకు ♦ నమ్మఁ గలిగె. 484

సీ. పూని నారూపంబు ♦ భూతజాలంబులు
భూతభావనుఁడ నేఁ ♦ బొందవడఁగ
బ్రహ్మంబు మఱియు శ ♦ బ్దబ్రహ్మమును శాశ్వ
తం బైన తనువులు ♦ దగిలె నాకు
నఖిలలోకములందు ♦ ననుగతం బై యుండు
లోకంబు నాయందు ♦ లోఁకఁ జెందు
నుభయంబు నాయందు ♦ నభిగతం బై యుండు
నభిలీన మగుదుని ♦ యుభయమందు

తే. వెలయ నిద్రించువాఁ డాత్మ ♦ విశ్వమెల్లఁ
జూచి మేల్కాంచి తానొక్క ♦ చోటివాఁని

గా వివేకించుమానసి • జీవితేశ
మాయ దిగనాడి పరమధ • ర్మంబుఁ దెలియు.

ఆ. నిద్రవోవువేళ • నిరతుఁడై దేహి దా
నెట్టి గుణముచేతఁ • నింద్రియములఁ
గడచినట్టి సుఖము • గనునట్టి బ్రహ్మంబుఁ
గడిమి మెఱయ నన్నుఁ • గా నెఱుంగు.

ఆ. స్వప్నమందు నెట్లు • సంచార మొనరించు
మేలుకాంచి దృష్టి • మోలి నెఱుఁగు
నుభయ మెఱుఁగునట్టి • యుత్తమజ్ఞానంబు
తత్త్వమట్టిదైన • తలఁపు నేను.

సీ. అరయంగ నెవ్వని • కలవిగానట్టి యీ
సలలితమానుష • జాతిఁ బుట్టి
యాత్మతత్త్వజ్ఞాన • హేతుఁడైనవానికిఁ
గలుగునె యెందు సు • ఖం బొకింత
వెలయఁ బ్రవృత్తిని • వృత్తి మార్గంబుల
సుఖమును దుఃఖంబు • సొరిదిఁ దెలిసి
పనిచేసి సంకల్ప • ఫలమూలమునఁ బాఱు
కడు సుఖదుఃఖమో • హములఁ గాంచు

ఆ. దంపతిక్రియామ • తంబు వర్తింతురు
దాన మోక్ష మేల • దక్కియుండు
నఖలదుఃఖహేతు • వయిన యాకర్మంబు
నెఱిఁగి నన్నుఁ దలఁప • రిచ్చలోన.

వ. మఱియు విజ్ఞానాభిమానులు లయిన మనుష్యులకు నక్క

సూక్ష్మం బయిన యాత్మగతి నిజస్థానత్రయలక్షణంబునం జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మిక విషయంబుల చేతను వివేకబలంబుల చేతను నియుక్తుండై జ్ఞాన విజ్ఞానసంతృప్తుం డైన పురుషుండు నాకు భక్తుండగు నీ విధంబులు గలవారలు యోగనైపుణబుద్ధి గల వారలు నై స్వార్థం బయిన యాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు. నీవు నీక్రమంబున నుద్భక్తిశ్రద్ధాపరుడవై విజ్ఞాన సంపన్నంబు లైన వాక్కులచేత నన్ను స్తోత్రంబు సేసి ముక్తుండ వైతి, వని యాశేషభగవంతుండు విద్యాధరపతి యైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుండై పోయెను.

వ. ఏదిక్కున సర్వాత్మకుండైన యనంతుం డంతర్ధానంబు నొందె, నాదిక్కునకు విద్యాధరభర్త నమస్కరించి గగనచరుండై చని లక్షలసంఖ్య లైన దివ్యవర్షంబు లవ్యాహతబలేంద్రియుండై పరమయోగపురుషులును దివ్యమునీంద్రులును సిద్ధచారణ గంధర్వులును వినుతి సేయం గులద్రోణాది శైలంబులను రమ్యప్రదేశంబులను సంకల్పసిద్ధ ప్రదేశంబులను వినోదించుచు శ్రీనారాయణదత్తం బగు దివ్యవిమానంబునందుం జరియించుచు నుండె. 489

శా. ఆడించున్ హరిదివ్యనాటకగుణ • వ్యాపార నృత్యంబులం
బాడించున్ జలజాతనేత్రబిరుద • ప్రఖ్యాతగీతంబులం
గూడించున్ సతతంబు జిహ్వలతుదన్ • గోవింద నామావళుల్
కీర్తించున్ వరయక్షకామినుల చే • కృష్ణార్పితస్వాంతుడై.

సీ. వాసించు నాత్మఁ బో • వైష్ణవజ్ఞానంబు
నాశించు భాగవ • తార్చనంబు
భూషించు నేహరిన్ • బుండరీకాక్షుని
భాషించు హరికథా • ప్రౌఢి మెఱసి
ఘోషించు హరినామ • గుణనికాయంబులు
పోషించుఁ బరతత్త్వ • బోధ మరసి
సేవించు శ్రీకృష్ణ • సేవకానీకంబు
సుఖమునఁ జేయు నీ • శునకు బలుఁలు
తే. పాదుఁ బాసించు వైకుంఠ • భర్తనటన
రూపవర్తనగుణనామ • దీపితోరు
గీతజాత ప్రబంధనం • గీతవిధులఁ,
గేశవప్రీతిగాఁ జిత్ర • కేతుఁ డపుడు. 491

చిత్రకేతుం డీశ్వరధిక్కారంబున గౌరిచే శాప మొందుట.

మ. హరిఁ గీర్తించుచు నల్లనల్లమదిలో • నజ్ఞానముఁ బీక్షించుచుం
బరమానందమునొందుచుఁ జగములం • బ్రఖ్యాతివర్తించుచుఁ
సురరాజోపమమూర్తియక్షగణముల్ • సొంపార విద్యాధరా
ప్సరసల్ గొల్వఁగ:బాడఁగా సితగిరి • ప్రాంతంబునం బోవుచున్ 492
శా. ఆవిద్యాధరభర్త గాంచె హరసీ • హారామృతాహాసమున్
శ్రీవిభ్రాజితమున్ నిరస్తగిరిజా • సేవాగతాయాసమున్
దేవానీకవికాసమున్ శుభమహో • దేవాంఘ్రిసంవాసమున్
భూవిఖ్యాతవిలాసముంద్రిభువనీ • పూతంబు గైలాసమున్.
క. ఆరజతభూధరంబున •
నీరేజభవామరాది • నికరము గొల్వం

చేరోలగమున నుండిన
గౌరీయుతుఁ డయిన హరునిఁ • గనియె నరేంద్రా. 494

సీ. తననిజరూపము • గనియును దెలియక
వావంబు సేసెను • వెదరవముఁ
గరుణావలోకనా • కాంక్షితులై యున్న
బ్రహ్మాదిసనకాది • ప్రముఖరవము
సారశివానంద • సల్లాపముల నొప్పు
ప్రమథగణాళియా • ర్భటనంబు
డమరుమృదంగాది • ఘనఘనధ్వనితోడి
పటుభృంగి నాట్యవి • స్ఫారరవము

తే. మానుగాఁ జామరలు వీచు • మాతృకాది
కామినీజనసహితకం • కణరవంబు
మొరయు జెలఁగంగఁ గన్నుల • పండువయ్యెఁ
గొండరాచూలి పెనిమిటి • నిండుకొలువు. 495

వ. ఇట్లు బ్రహ్మాదిసురనికరసేవితుండై యూరుపీఠంబున నున్న భవానిం గౌఁగిటం జేర్చికొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుని జూచి చిత్రకేతుండు పకపకనగి యద్దేవి వినుచుండ నిట్లనియె 496

సీ. శ్రీమనొప్పగా లోక • గురుఁడును గడలేని
ధర్మస్వరూపంబు • దాన యగుచు
జడలుధరియించియు • సరిలేనితపమునఁ
బొడవైన యామోగి • పుంగవులును

బ్రహ్మవాదులుఁ గొల్వ • భాసిల్లు కొల్వులో
మిథునరూపంబున • మెలఁతతోడఁ
బ్రాకృతుండునుబోలె • బద్ధానురాగుఁడై
లాలితుం డయ్యె ని • ర్లజ్జత నట
ఆ. నకట ప్రకృతిపురుషు • డైన దా నేకాంత
మందు సతులతోడ • నలరు గాని
యిట్లు ధర్మసభల • నింతులతోఁ గూడి
పరిభవింప లేఁడు • భ్రాంతి నొంది. 497

క. అన విని సర్వేశ్వరుఁడా
తని కేమియు ననక నవ్వి • తత్సభవారల్
గనుఁగొన నూరకయుండెను
మనుజేశ్వర యీశుధైర్య • మహి మెట్టిదియో. 498

వ. ఇట్లు తనపూర్వకర్మశేషంబున నింద్రియజయుండ నని పుట్టిన యహంకారంబున జగద్గురువుం బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుం జూచి భవాని యిట్లనియె. 499

క. మముబోఁటి లజ్జలుడిగిన
కుమతులం గర్తయగుచుఁ • గోపింపంగా
నమితాజ్ఞానిపుణుం డగు
శమనుండా వీఁడు నేఁడు • జగముల కెల్లన్. 500

క. భృగునారద కపిలాదులు
నిగమాంతజ్ఞులును యోగ • నిర్ణయనిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు
నగ రెన్నఁడు వారు ధర్మ • నయ మెఱుఁగ రొకో. 501

సీ. ఎవ్వని పదపద్మ • మింద్రాది విబుధుల
చూడాగ్రపంక్తుల • నీడఁ జూచు
నెవ్వని తత్త్వంబ • దెనయంగ బ్రహ్మాది
యోగి మానస పంక్తి • నోలలాడు
నెవ్వని రూపంబు • నేర్పాటుగానక
వేదంబు లందంద • వాద మడుచు
నెవ్వని కారుణ్య • మీలోకముల నెల్లఁ
దనిపి యెంతయు ధన్య • తములఁ జేయు
తే. నట్టి సర్వేశుఁ బాపసం • హారుధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మ సం • సారు నీశు
నెగ్గువల్కిన పాపాత్ముఁ • డెల్లభంగి
దండనార్హుండు గాకెట్లు • దలఁగఁగలఁడు. 502
తే. నిఖిలలోకాశ్రయంబు స • న్నిహిత సుఖము
సకల భద్రైకమూలంబు • సాధుసేవ్య
మైన కంజాక్షు పాదప • ద్మార్చనంబు
ననుసరింపంగ ఖలుఁడు పేఁ • డర్హుఁ డగునె. 503
వ. కావున నోరిదురాత్మక యీపాపంబునం బాసస్వరూపం బైన రాక్షసయోనిం బుట్టుమని శపియించి యింత నుండి మహాత్ములకు నవజ్ఞ సేయకుండుమని పలికిన, జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి యద్దేవికి దండ ప్రణామంబు లాచరించి కర కమలంబులు దోయిలించి యిట్లనియె. నోజగన్మాతా భవచ్ఛాప వాక్యంబు లట్ల కైకొంటిఁ. బ్రాచీన కర్మంబులం బ్రాప్తంబైన సంసార చక్రంబుచేత నజ్ఞాన

మోహితులయి తిరుగుచున్న జంతువులకు సుఖదుఃఖంబులు నైజంబులయి ప్రవర్తిల్లుచుండు, నిందులకుఁ బరతంత్రుల యిన వారాత్మ పరసుఖదుఃఖంబులు నెవ్వరు కర్త, లీగుణంబులనిమిత్తమై శాపానుగ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుఃఖంబులును సమంబులు, భగవంతుండొక్కరుండ తన మాయచేత జగంబుసృజియించుచుండు,వారివారికి బంధాదిరాగంబులు గలుగంజేయుచు దాను వానికి లోనుగాకనిమఱ్ఱుంకుండయి యుండు. నీవిధంబునం బుట్టుచున్న నరునకుం బత్నీబంధుశత్రుమిత్రోదాసీనత్వంబు లెక్కడివి, వారివారికర్మవశంబునం బరమేశ్వరుండు గల్పించుచు సర్వంబునందు సర్వసముండై యుండు, నప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబులచేత రాగంబు లేదు రాగానుబంధంబైన రోషంబును లేదని మాయాగుణ విసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను బంధమోక్షంబులను గల్పించుచుండుం, గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము. శాపభయ శంకితుండం గాను, జగన్మాతవగు నిన్నుఁ బలికినదోషంబునకు శంకించుచున్న వాఁడనని దండప్రణామంబు లాచరించి పార్వతీపరమేశ్వరులం బ్రసన్నులంజేసి తనవిమానం బెక్కి చనియె నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాదిదేవర్షి దైత్యదానవ ప్రమథగణంబులు వినుచుండఁ బార్వతికి నిట్లనియె. నీకువిప్పుడు దృష్టంబయ్యెఁగదా నారాయణదాసదాసానుచరులనిస్పృహాభావంబు హరితుల్యార్థదర్శను లై నిస్పృహులయిన భాగవతులకు స్వర్గాప

వర్గసరక భేదభావంబులు లేవు, ప్రాణులకు దేహసంయో
గంబు నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాని సుఖదుః
ఖంబు లాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయఁబడియె.
నిట్టి విపర్యయంబులు భగవంతుం డగున వాసుదేవుని భక్తి
గలవారిం జెందవు మఱియును 504

ఉ. నేనుఁ గుమారవారదులు • నీరజగర్భుఁడు దేవసంఘముల్
మానితయోగివర్యముని • మండలి మున్నగు నార మెల్ల నా
దానవవిద్విడంశ జని • తంబులమయ్యుఁ దదీయతత్త్వముం
గానఁగ నేరమీశు ఘన • గర్వమునం దలపోసి చూచుచున్.

క. ఆతనికిం బ్రియుఁ డప్రియుఁ
డే తెఱవున లేఁడు నిఖిల • మెల్లను దానై
భూతముల కాత్మ యగుటయు
భూతప్రియుఁ డొకఁ డాది • పురుషుఁడు తన్వీ. 506

ఆ. అరయఁ జిత్రకేతుఁ • డతిశాంతుఁ డతిలోక
సముఁడు విష్ణుభక్తి • సంగతుండు
నితని నేమి సెప్ప • నీశుండ నగు నేను
నువిద యచ్యుతప్రి • యుండఁ జుమ్ము. 507

క. కావున భగవద్భక్తుల
భావమునకు విస్మయంబు • పని లేదు మహా
దీవిభవ శాంతచిత్తులు
పావన పరతత్త్వ నిపుణ • భవ్యులు వారల్. 508

వ. అనిన విని యద్రినందన విస్మయంబు మాని శాంతచిత్త
యయ్యె. నటు పరమ భాగవతుం డయిన జిత్రకేతుం డద్దే

విశ్రం బ్రతిశాపం బియ్య సమర్థుండయ్యును మరల శపింపక యతిశాంతరూపంబున దచ్ఛాపంబుశిరంబునధరియించె నిట్టి నాథులక్షణంబులు నారాయణపరాయణు లయిన వార లకుం గాక తక్కొరులకుం గలుగనేర్పునే. యట్లు శాపహ తుం డయిన చిత్రకేతుండు త్వష్ట సేయు యజ్ఞంబున దక్షి ణాగ్నియందు దానవయోనిం బుట్టి వృత్రాసురుం డన విఖ్యాతుండయి భగవద్జ్ఞానపరిణతుం డయ్యెం గావున. 509

సీ. నరనాథ యీవృత్రు • నకు రాక్షసాకృతి
గలిగిన యీపూర్వ • కారణంబు
చిపుణ్యుం డయినట్టి • చిత్రకేతుమహాను
భావంబు భక్తితోం • బరంగ విన్న
చదివినవారికి • సకలదుష్కర్మముల్
శిథిలంబు లై కడుం • జెదరి పోవు
సకలవైభవములు • సమకూరుం దమయంతం
దొలొఁకెడుకోర్కుల • తోడం గూడి

ఆ. నిర్మలాత్ములగుచు • నిత్యసత్యజ్ఞాన
నిరతు లగుచు విగత • దురితు లగుచు
బంధుమిత్రపుత్ర • పౌత్రాదులను గూడి
యనుభవించు చుందు • రధికసుఖము. 510

సవితృవంశప్రవచనాదికథ.

సీ. వినవయ్య నరనాథ • విశదంబుగా ద్వష్ట
వంశంబు నెప్పితి • వానివెనుక

సవిత్రుండు పృశ్నియు • సావిత్రి వ్యాహృతి
యను భార్యలందు గ్రమ • ప్రాగు వేద
నగ్నిహోత్రంబుల • నరయంగ బహుసోమ
పంచయజ్ఞంబులం • బరగ గనియె
భగుండు సిద్ధి యను • భార్యకు మహిమాను
భవులవిభవులం దా • బడసెమువురం

ఆ. దనయ నొకతెం గాంచె • దదనంతరమున నా
తరళనేత్రి సద్వ్రి • తస్వధామ
పుణ్యశీల సుగుణ • పూరితచారిత్రి
యఖిలలోకపూజ్య • యాశిషాఖ్య. 511

వ. మఱియు ధాతకుం గల కుహూ సినీవాలీ రాకానుమతు లనియెడు నలువురు భార్యలతోం గుహూదేవి సాయ మను సుతునిం గాంచె, సినీవాలిదర్శాఖ్యునిం బడసె. రాకప్రాతరాఖ్యునిం గాంచె, ననుమతి పూర్ణమాఖ్యునిం గనె. విధాతక్రియ యను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె. వరుణునకుం జర్షణి యను భార్యయందుం బూర్వకాలంబున బ్రహ్మపుత్త్రుం డయిన భృగువును, వల్మీకంబునం జనియించిన వాల్మీకియు నుదయించిరి. మిత్త్రావరుణులకు నూర్వశియందు రేతోద్గమం బైన దానిం గుంభంబును బ్రవేశింపం జేయ నందు నగస్త్యుండును వసిష్ఠుండును జనియించిరి. ప్రత్యేకంబ మిత్త్రునకు రేవతియందు నుత్సర్గసం

భవులైన యరిష్టయుఁ బిప్పలుండును నను వారలు జనియిం
చిరి. శక్రునకుఁ బౌలోమియందు జయంత ఋషభ విదు
షులను ముగ్గురు పుట్టిరి. వామనుం డయిన యురుక్రమదేవు
నకుఁ గీర్తి యను భార్యయందు బృహశ్లోకుండు పుట్టె, నా
బృహశ్లోకునకు సౌభగాదులు పుట్టిరి. మఱియు మహాను
భావుం డయిన కశ్యపప్రజాపతికి నదితియందు శ్రీమన్నా
రాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద.
దితిసుతు లైన దైతేయులవంశంబు సెప్పెద. నే దైతేయ
వంశంబునం దైనను బ్రహ్లాదబలులు పరమభాగవతు లై
దైత్యదానవవందితు లై వెలసి రా దితి కొడుకులు హిరణ్య
కశిపు హిరణ్యాక్షు లనఁ బ్రసిద్ధి నొంది. రందు హిరణ్యా
కశిపునకు జంభాసురతనయ యైన దత్తకుఁ బ్రహ్లాదాను
హ్లాద సంహ్లాద హ్లాదు లను నలుగురు కొడుకులును సిం
హిక యను కన్యకయు జన్మించి, రా సింహికకు రాహువు
జనియించె, నా రాహువుశిరం బమృత పానంబు సేయు
హరి దన చక్రంబునం ద్రుంచె; సంహ్లాదునకు గతి యను
భార్యయందుఁ బంచజనుండు పుట్టె; హ్లాదునకు దమని యను
భార్యయందు వాతాపీల్వలులు పుట్టిరి వారల నగస్త్యుండు
భక్షించె; ననుహ్లాదునకు సూర్మి యను భార్యయందు
బాష్కలమహిషులు గలిగిరి; ప్రహ్లాదునకు దేవి యను
భార్యయందు విరోచనుండు పుట్టె, నతనికి బలి జన్మించె,
నాబలికి నశనయను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా
నూర్వురు గొడుకులు పుట్టి, రాబలి ప్రభావంబు వెనుక వివ

రించెద; బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథ
గణంబులకు ముఖ్యుం డయ్యె మఱియు నాదితిసంతానంబు
లగు మరుత్తు లేకోనపంచాశత్సంఖ్య గలవార లందఱు సన
పత్యులై యింద్రునితోఁ గూడి దేవత్వంబు నొంది రనిన విని
పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 512

ఆ. ఏమి కారణమున • నింద్రునికి మరు
చ్చయము నాప్త మగుచు • శాంతి నొంది
యరయఁ దత్సమాను • మగుచు వర్తించెను
దీని వినఁగవలయుఁ • దెలుపవయ్య. 513

వ. అనిన శుకుం డిట్లనియె. 514

సీ. నరనాథ విను తన • నందను లందఱు
నమరేంద్రుచే హతు • లగుచు నుండఁ
గోపశోకంబుల • గ్రుళ్ళుచుఁ దనలోన
మఱుఁగుచు దితి చాల • మఱుఁగఁదొడఁగె
భ్రాతృహంతకు డతి • పాతకుం డీయింద్రుఁ
డంపక నాకేల • సొంపు గలుగు
వీని భస్మము సేయు • వానిఁ గా నొకసుతుఁ
బడసెద నని చాల • భక్తిఁ గోరి

ఆ. ప్రియము సేయఁ దొడఁగెఁ • బెక్కుభావంబులు
భాషణముల నధిక • పోషణముల
భక్తియుక్తిచేత • బరిచర్యగతిచేత
నతులచేత నతుల • రతులచేత.

చ. కలికికటాక్షవీక్షణని • కారములన్ హృదయానురాగసం
కలితవిశేషవాఙ్మధుర • గర్జనలన్ లలితాననేందుమం
డలపరిశోభితామృతవి • డంబితసస్మితసుప్రసన్నతా
ఫలరుచిరప్రధానముల • భామిని భర్తమనంబులోఁగొనెన్.

తే. అట్టుల మెఱఁగిన కశ్యపుఁ • డంతవాఁడు
హితవు తలకెక్కురతుల సం • గతులఁ జేఁ ద
నవశుఁ గావించె వెల్మిడి • నబ్జవదన
పతుల భ్రమయింప నేరని • సతులగలరె. 517

క. ఏగలఁ బెఱుఁగక నిలిచిన
భూతంబులఁ జూచి ధాత • పురుషులమనముల్
భీతిఁ గొలుపంగ యువతి
వ్రాతంబు సృజించెఁ బతులు • వారల కరుదే. 518

వ. ఇట్లు నిజసతిచేత నుపలాలితుండై కశ్యపప్రజాపతి యాసతికిఁ బరమప్రీతుండై యిట్లనియె. నోతన్వీ నీకుఁ బ్రసన్నుండ నైతి. వరంబుగోరు మిచ్చెద నాథుండు ప్రసన్నుండైన స్త్రీలకుం గోరిక సంభవించుట కేమి గొఱఁత, పతికిం బతియె దైవంబు, సర్వభూతంబుల మానసంబుల వాసుదేవుండె భర్త, నామరూపపరికల్పితులైన సకలదేవతామూర్తులచేతను ఋషులచేతను భర్తృరూపధరుండయిన భగవంతుండు సేవింపంబడు చుండు. విశేషించి స్త్రీలచేత బతిరూపంబున భజియింపఁబడుఁ గావునం బతివ్రతలైన సుందరులు శ్రేయస్కామలై యేకచిత్తంబున నాత్మేశ్వరుం డయిన యప్పరమేశ్వరుని భర్తృభావంబున సేవించు

చుంకుడు కేరును నీకిఁ భావంబున వరదుండ వైతి పతుల్కీల
లయిన వనితలకుం బొంద రాని వరంబు నీకిచ్చెద వేఁడు
మనిన నా కశ్యపునకు దితి యిట్లనియె. 519

ఆ. వరము గోర నాకు ♦ వరదుండ వేనియు
నిందుఁ జంపుచునట్టి ♦ యిద్ధబలుని
నమితతేజుఁ దనయు ♦ నమరత్వసంప్రాప్తు
నొందఁ జేసి నాకు ♦ నిమ్ము నాథ. 520

వ. అనవుడు 521

క. ఉట్టి పడునట్టివర మీ
కట్టిఁడి నన్నిట్టు వేఁడెఁ ♦ గటకట యనుచుం
బిట్టిపడి యతఁడు మదిలోఁ
బుట్టిన తల్లడముతోడఁ ♦ బొక్కుచు నాత్మన్. 522

చ. ప్రకృతినిఁ గర్మపాశముల ♦ బద్ధుఁడ నైతి గదయ్య నేఁడు నే
వికటసతీస్వరూపమున ♦ నేఁడు గొల్చిన మాయ నింద్రియా
ధికమతినైన నాఁకు ఘన ♦ తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పా
తకములఁ గూలఁ గున్న నను ♦ దైవము నవ్వదె లోలితాత్మునిన్.

సీ. ఖండశర్కరతోడి ♦ గలహించు పలుకులుఁ
బద్మవిలాస మే ♦ ర్పఱచు మోము
దుహినాంశుకళలతోఁ ♦ దుల దూగు చెయ్యులు
జెమటఁ గ్రొన్నెత్తురు ♦ సేయు మేను
సిలు నెల్లఁ గరగించు ♦ నిప్పులు నేర్పులు
పువ్వుల కరువైన ♦ ప్రోది సేఁత

తమకంబు రెట్టించు • తెరఁ దీపు తలఁపులు
నెనసిన మదిలోన • నిచ్చగింతు

ఆ. కలిగి కలవ నున్న • కాలహింపోలికి
జెలఁగుచున్న సతుల • చిత్తవృత్తిఁ
దెలియ వశమె యెంత • ధృతి గలవారికి
నాకగాదు నిఖిల • లోకములకు. 524

ఆ. కోరసతుల కెల్లఁ • గూర్పువా రెవ్వరు
పతుల నైన సుతుల • హితుల నైన
బలిమిఁ జేసి యైనఁ • బరహస్తమున నైన
హింస సేతు రాత్మ • హితము కొఱకు. 525

వ. అని చింతించి దీనికి నేమి ప్రతివాక్యం బిచ్చువాఁడ మద్వచనం బెందున మోఘంబు త్రిలోకపరిపాలనశీలుం డయిన భిదురపాణి వధార్హుండె యేను దీనికి నైనది యొకటిగల్పించెద నని దితిం జూచి యో తనుమధ్య నీకు నట్లు దేవబాంధవుం డయిన యింద్రహంత యగు పుత్త్రుండు గలిగెడుఁ నొక్క సంవత్సరం బీ వ్రతంబు నాచరింపుము దాని ప్రకారం బెల్ల నేను జెప్పెద విను మెల్లజీవులవలన హింసాభావంబు లేక యతిధ్వనివాక్యంబు లుడిగి కోపంబుమాని యనృతంబులు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక యస్థికపాలాదు లయిన యమంగలంబుల నంటక జలంబుఁజొచ్చి కాని ఘటోదక కూపోదకంబుల స్నానంబు సేయక దుర్జన సంభాషణంబు వర్జించి కట్టినకోకను ముడిచిన పువ్వులను గ్రమ్మఱ ధరియింపక భోజనంబులయందు నుచ్ఛిష్టాన్నం

బును జండికాని వేదితాన్నంబును గేశయుక్త మార్జాలకంక క్రిమిపిపీలికాది విదూషితాన్నంబును నామిషాన్నంబును వృషలాహితాన్నంబును ననునీపంచవిధ నిషిద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్ళు ద్రావక సంధ్యాకాలంబుల ముక్తకేశి గాక మితభాషిణియై యలంకారవిహీన గాక వెలుపలం దిరుగక పాదప్రక్షాళనంబు సేసికాని కాని శయనింపక యార్ద్రపాదయై పవ్వళింపక పశ్చిమశిరస్కయయ్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌతవస్త్రంబులుగట్టి శుచియై సర్వమంగళ సంయుక్తయై ప్రాతఃకాలంబునఁ దూర్పు మొగంబై లక్ష్మీనారాయణుల నారాధించి యావాహనార్ఘ్య పాద్యోపస్పర్శనస్నాన వాసోపవీతభూషణపుష్ప ధూపదీపోపహారా ద్యుపచారంబుల నర్చించి హవిశ్శేషంబు ద్వాదశాహుతులు వేల్పించి దండప్రణామంబు లాచరించి భగవన్మంత్రంబును దశవారంబు లనుసంధించి స్తోత్రంబు సేసి గంధ పుష్పాక్షతంబుల ముత్తైదువులం బూజించి పతిని సేవించి పుత్త్రిం గుక్షిగతుంగా భావించి యివ్విధంబున మార్గశీర్ష శుద్ధప్రతిపదారంభగా నొక్క సంవత్సరంబు సలిపి యా ద్వాదశమాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు, నిదిపుంసవనం బనియెడి వ్రతంబు ద్వాదశమాసపర్యంతం బేమఱక సల్పిన నీవు గోరినకుమారుండు గలిగెడు ననిన, దితి యావ్రతంబుతోడ నె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచు నుండ నింద్రుండును మాత్ర

శూరుం డేడేసి మనుక
గా రయమున వారు సెడక • ఖండితు లయ్యున్. 528

క. ఖండము లన్నియు నందఱుఁ
జండాంశుసమప్రకాశ • శాశ్వతు లగుచుం
మెండుకొని నిల్చి యని రా
ఖాండలునకుఁ గరుణావృత్తు • గతి మతి ద్రోహా. 529

వ. అందఱు ముకుళితకరకమలులై నీకుం దోఁడుఁబుట్టువులము
మమ్ము హింసింపం బని లేదు నీకుం బార్షదులమై మరు
ద్గణములమై నిన్ను సేవించెదము మమ్ము రక్షింపుమనిన
నారాయణ ప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకు
లకుం గృపాళుండై యింద్రుడు వారల సహోదరులంగాఁ
గైకొని మఱి హింసింపక మానె. నశ్వత్థామ శరాగ్నివలన
నారాయణ రక్షితుండ వయిన నీవునుం బోలెఁ గులిశధా
రలశకలంబు లయిన కుమారులుం దన్నిరూపంబులై సంవత్స
రంబునకు నొక్కింత కడమగా హరిం బూజించిన నుద్భవిం
చినవారు గావున నింద్రుతోడం గూడ నేకోనపంచాశద్దే
వత లయిన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడిరంత
దితి మేల్కాంచి యనల్పప్రకాశులై యింద్రుతోడం గూడి
వెలుంగుచున్న కుమారులం జూచి సంతోషింపక యిం
ద్రుం జూపి యిను మృత్యురూపంబయిన పుత్రుంగోరి దుస్త
రంబయిన వ్రతంబు సలిపితి సంకల్పించిన పుత్రుండొక్క
రుండే సప్తసప్త సంఖ్యగల కుమారు లగుట కేమికతంబు

నీవెఱింగిన భంగిన తథ్యంబు పలుకు మనిన నింద్రుండిట్లని యె. దల్లిభవద్వ్రతంబుఁ జింతించి సముదానిచ్ఛేదనంబున గర్భంబుఁ జొచ్చి పాపచిత్తుండనై వజ్రధారల గర్భంబు విదళనంబు సేసిన నాశకలంబులు సెడక మహాశ్చర్యంబుగా నివ్విధంబునం గుమారకు లైరి. మహాపురుషపూజాసంసిద్ధి కార్యానుషంగి గాకుండునే భగవదారాధనంబు గోరికలఁ బాపి యెవ్వరు గావింతురు వారి హాపరంబుల సర్వార్థకుశలులగుదు రమ్మహాపురుషవ్రతసముత్పన్న తేజంబు నడంప నెవ్వండోపుఁ, గావున దుర్మదంబున బాలిశస్వభావుండనై దోషంబు సేసిన నాదౌర్జన్యకర్మంబు సహింపఁ దల్లికన్న నెవ్వరు సమర్థులు, పాపాత్ముండనగు నన్నుఁగావుము, నేను వీరలతోడివాఁడనని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన నద్దేవి యట్లకాక యని శాంతచిత్తయయ్యె. నింద్రుండును వారలం గూడి త్రిదినంబునకుం బోయి సోమపానహవిర్భాగం బులు వారలకుం బంచిపెట్టి కూడి సుఖంబుండెనని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు నిట్లనియె. 530

క. హరి వరదుఁ డనువ్రతముఁట

హరియంశజు లగుచు నెగడు ♦ నమరులజన్మ

స్ఫురణంబుఁట పఠియించిన

నరయఁగ నుటుదీర్ఘకర్మ ♦ హరమగు టరుదే. 531

వ. అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమానమానసులైన శౌనకాది మహామునులకు సూతుండు చెప్పెనని శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పిన నతండు. 532

క. వనజాక్షునకుఁ బ్రియవ్రత
మని యుంటెఁ బుంసవనము • నది విన వలతున్
మునినాథ సాంగముగ నా
కు నెఱుంగం జెప్పు మన శు • కుం డిట్లనియెన్. 533

తే. సతులు పతియాజ్ఞ మార్గశీ • ర్షంబునందు
శుక్లపాడ్యమి మొదలుగా • శుద్ధరదన
లగుచు జల మాడి ధౌతశుక్లవసన లయి
విప్రజనులను రప్పించి • వేడుకలర. 534

ఆ. ఈ వ్రతంబు సేయ • నెంతురు సంతాన
కామ లగుచు సార్వ • కామికంబు
పగలు రాత్రి వారిని • భక్తిఁ బూజింతురు
కలిమి చెలువ క్రోడ • గడు ముదమున. 535

వ. దేవా! యిచట నీమనర్పందగు కార్యములు లేమిఁ జేసి నిరపేక్షుండవై పూర్ణకాముండవై లక్ష్మీపతివై సంకల్ప సిద్ధుండవై యున్న నీకు నమస్కారము. ఈశ్వరా నీవు కృపాభూతి తేజస్సహోజాదిగుణసహితుండవు, విభుండవగు నీకు జాతే మహామాయయు మహాపురుష లక్షణయుఁ బ్రియదామయు మహాభాగయు లోకమాతయు విష్ణుపత్నియు నగు నీకు వందన మ్మని లక్ష్మీనారాయణులం బూజించి ఓం నమో భగవతే మహాపురుషాయ మహాను

భావాయ మహావిభూతపతయే సహానుచరప్రభూతిభి ర్బలి
ముపహారాణియను మంత్రంబునఁ బ్రతిదినంబును నానావా
నాస నార్ఘ్యపాద్యాచమనీయ స్నానవాసోపవీతగంధ
పుష్ప ధూపదీపోపహారా ద్యుపచారంబుల సమాహిత
చిత్తులై యొనర్పవలయు. మఱియు ఓం నమో భగవతే
మహాపురుషాయ మహావిభూతయే స్వాహా యను మంత్రం
బున బండ్రెండుమూఁటు లగ్నియందు హవిశ్శేషంబు
నాహుతి చేయవలయు. సర్వసంపదలం బడయం గోరు
వారలు, మహావిభవులును బురాణదంపతులు నగు లక్ష్మీ
నారాయణులం భక్తితో నిత్యము బూజింపవలయు.
నిటులం బూజించి దండంబువలె భూమిం బడి నమస్క
రించి దశవారంబులు మంత్రింబు జపించి యాటుపై స్తుతింప
నగు 536

క. జగములకుఁ గారణం బయి
జగములకుం బర మగుచును • శాసక మగుచుం
మిగిలిన పురుషోత్తమునిం
దగిలిన భక్తిని నుతింతుఁ • దాపము లడఁగన్. 537

తే. సూక్ష్మశక్తి దురత్యయ • సొంపుమీఱ
నడపుటం జేసి నివ ప • రుఁడవటంచు
నఖిలయజ్ఞము లిజ్యక్రి • యాఫలములు
తత్ఫలాసి వటంచు నేఁ • దలఁతు మదిని 538

వ. దేవా నీ కీదేవి గుణవ్యక్తి యగు నీవు వ్యంజకుండవును ఫల
భుజుండ వగుదువు, నీవు సకలశరీరంబుల నుండు హేత్వ-

లక్ష్మీదేవి శరీరంబుల నుండు నింద్రియంబుల నాశ్రయించు
నది. నిన్నిదేవి నామరూపస్వరూపమై యాశ్రయించి
యున్నది మీరిరువురును దిగ్భాగంబులకు వరదులుగం బర
మేశ్వరులగుటం జేసి సంతానవరంబును బ్రసాదింపుం డని
స్తుతించి యుపహారంబుల సమర్పించి యాచమనం బిచ్చి
యర్చింపవలయు. నంతరముం బైన వివిధస్తోత్రంబుల భక్తిచే
జేసి యజ్ఞోచ్ఛిష్టంబు నాఘ్రాణించిక
లిగుగహారంబూజింపవలయు. నిజపతిని నీశ్వరబుద్ధిచేఁ బర
మభక్తిని బ్రేమశీలయై తదనుకూలయై భజింపవలయు.
నీవ్రతంబు నాశక్తులైనను దంపతు లిరువురైనను విడువ
జేయందగును భార్య యీవ్రతంబును జేయుట కసమర్థా
యయ్యెనేనిఁ బురుషుండు చేయ వలయు. నిది విష్ణువ్రతం
బగుటంజేసి నడుమ విడిచి జేయరాదు, అధిక నియమంబున
బ్రాహ్మణసువాసినులఁ బ్రతిదినంబును స్రగ్గంధబలిమండనం
బులచే నర్చింపవలయు. తనయింట నుంచినదేవు నెదుట
నుంచు నైవేద్యంబుల నాహరించి యుద్వాసింపవలయు. నటు
లఁ జేయుటచేతఁ జిత్తశుద్ధియు సర్వకామావాప్తియుఁ
బ్రాప్తించును. ఈవిధంబునఁ బన్నెండుమాసంబులు పూజా
విధుల సలిపి కార్తికమాసము కడపటిదినమునఁ దెల్లవారి
లేచి యుపవసించి శ్రీకృష్ణు నర్చించు పత్నిసయు
స్నన నతితో గూడిన చరువునను బార్హణస్థాలీపాకవిధానం
బునను ద్వాదశాహుతుల నిచ్చి, భక్తిచే బ్రాహ్మణులకు
భోజనం బిడి పతితో వారలకు సదాశీర్వాదంబు లగు సోద

పాత్రిలం దిలల దత్తంబు సేసి బ్రాహ్మణాశీర్వాదంబు
గైకొని వారలకు నమస్కరించి వారల యనుజ్ఞం గొని
యాచార్యునెదుట బంధువులతోడ చరు శేషంబు స్వీక
రింప వలయును. ఈ వ్రతంబును నిష్ఠం జేయు పురుషు
లభీప్సితార్థంబు లందుదురు, కన్య యీవ్రతం బాచరించె
నేని సమస్తలక్షణ యుతుం డగుపతిం బొందును. విధవ
పాపవిముక్తియగు మృతప్రజజీవసుతులనధనంబును సుర్భ
గిసుభగయు నగును. రోగు లనామయు లగుదురు. ఇది
పఠించిన వారల కర్మలకుం బితృదేవతలు తృప్తినొందిన
వారలయి సమస్త కామంబుల నొసంగుదురు. పరీక్షిన్మ
హారాజా యీదితి చేసిన మహాద్వ్రతంబు నీకుం జెప్పం
బడె ననుటయు. 539

క. రాజీవ రాజపూజ్య
శ్రీజిత గోపీకటాక్ష, సేవాంతర వి
భ్రాజితమూర్తి మదోద్ధత
రాజకులోత్సాహ రామ ♦ రాజాఖ్యనిధీ. 541

తరలము. మురవిదారణ ముఖ్యకారణ • మూలతత్త్వవిచారణా
దురితతారణ దుఃఖవారణ ♦ దుర్మదాసురమారణా
గిరివిహారణ కీర్తిపూరణ ♦ కీర్తనీయ మహారణా
ధరణిధారణ ధర్మతారణ • తాపసస్తుతి పారణా. 542

తోటకము. కరుణాకర శ్రీకర • కంబుకరా
శరణాగతసంగత • జాడ్యహరా

పరిరక్షితశిక్షిత • భక్తముగా
కరిరాజశుభప్రద • కాంతిధరా. 542

గద్యము. ఇది శ్రీసకలసుకవిజనమిత్త్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువయామాత్యపుత్త్ర బుధజనప్రసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబు నందు నజామిళోపాఖ్యానంబును, ప్రచేతసులకుఁ జంద్రుం డామంత్రణంబు సేయుటయు, దక్షోత్పత్తియు, భూజా సర్గంబును, దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు, నతనికి నప్పరమేశ్వరుండు ప్రత్యక్షంబగు టయు, హర్యశ్వశబళాశ్వుల జన్మంబును, వారలకు నారదుండు బోధించుటయు. నారదువచనప్రకారంబున వారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదువలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మవరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞుల సహస్రసం ఖ్యలకుగు పుత్త్రులం గాంచుటయును, సృష్టికర్మాకాం క్షానిమిత్తంబున దక్షుపంపున వారలగ్రజన్ములు సిద్ధిబొం దిన తీర్థరాజంబైన నారాయణసరస్సునకుఁ జనుటయు, వారికినారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబునుపదేశించుటయు వారు పూర్వజులేఁగినప్రకారంబున మోక్షంబు నొందు టయును దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టంబని తెలిసి నారదునిశపియించుటయు నారదుండు దక్షుశాపంబుప్రతిగ్రహించుటయుదక్షునకుమరల బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబు కొఱకుఁ గూఁతు లఱు

వంద్రుడు జనియించుటయు, నంతఁ గశ్యపునకు నిచ్చిన పదు
మువ్వుర వలన సకల లోకంబులు నిండుటయు, దేవాసుర
నరతిర్యఙ్మృగఖగాదుల జన్మంబులును, దేవేంద్ర తిరస్కా
రంబున బృహస్పతి యధ్యాత్మ మాయచేతం గానరా
కుండుటయుఁ, దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోప
దిష్టులై దేవతలపై నెత్తివచ్చుటయు, దేవాసుర యుద్ధం
బును, నాచార్య తిరస్కారంబున దివిజరాజ పలాయనం
బును, బలాయమానులైన దేవతలు బ్రహ్మసన్నిధికిం
జనుటయును, బ్రహ్మవాక్యంబునఁ ద్వష్టృకుమారుండయిన
విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరించుటయును
విశ్వరూపప్రసాదంబున నింద్రుండు నారాయణవర్మం
బను మంత్రకవచంబు ధరియించి రాక్షసులజయించుటయు,
బరోక్షంబున రాక్షసులకు ననుకూలుం డయిన విశ్వ
రూపు నింద్రుండు వధించుటయు, విశ్వరూపువధా
నంతరంబున, నింద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తం
బయిన నింద్రుండు స్త్రీభూజలద్రుమంబులయందుఁ బంచి
పెట్టుటయు, విశ్వరూపుండు హతుండగుటకుఁ ద్వష్ట గో
పించి యింద్రవధార్థంబు మారణహోమంబు సేయ వృత్రా
సురుండు జనించుటయు, వృత్రాసురయుద్ధంబునఁ బరాజి
తులై యింద్రసహితులయిన దేవతలు శ్వేతద్వీపంబునకుం
జనుటయు, నందు శ్రీహరి ప్రసన్నుండయి దధీచివలన భిదు
రంబు గైకొని నుపదేశించుటయు నింద్రుండు వజ్రాయు
ధంబున వృత్రుని సంహరించుటయు నింద్రుండు బ్రహ్మహ

త్యాపీడితుం డయిన మానససరస్సు ప్రవేశించుటయు, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి యింద్రాధిపత్యంబు వడయుటయు, నహుషుం డగస్త్యశాపంబున సురరాజ్యచ్యుతుండయి యజగరయోనిం బుట్టుటయు, నింద్రాగమనంబును, నశ్వమేధంబులు, నింద్రుండు మరలఁ ద్రిలోకాధిపత్యంబు వడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబులజన్మప్రకారంబును, పుంసవనవ్రతానుష్ఠానక్రమంబు పరీక్షిన్మహారాజునకు శుకుండు సెప్పుటయు నను కథలుం గల షష్ఠస్కంధము.

సంపూర్ణము.

హరిః ఓం తత్సత్; శ్రీనివా సార్పణ మస్తు





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B158 |
| పుస్తకం పేరు | శ్రీమదాంధ్ర భాగవత పద్యములు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 179 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | (N) 172 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | B. Jagamma |
| పేజీలు విడదీసినది | P. Jagamma |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |